ఆంధ్రప్రబోధినీగ్రంథనిలయము. ప్రథమభూషణము.

# ఉర్వీసుతోద్వాహము.

"శ్లో॥ విద్యానామ నరస్యరూప మధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం।
విద్యాభోగకరీ యశస్సుఖకరీ విద్యాగురూణాం గురుః।
విద్యాంబంధుజనో విదేశగమనే విద్యాపరాదేవతా।
విద్యారాజసుపూజ్యతే నహిధనం విద్యావిహీనః పశుః॥"

ఇది

ఇకుర్తి తిరుపతిరాయ విరచితము.

...నారాయణచే

...లితము.



...కినాడ:

...అండ్ కో లో

కె. సుబ్బారాయుడు బ్రదర్సువారివలన ముద్రితము.

1923.

కాపీరైటు రిజస్టర్డు] [వెల రు 1—0—0.

# పండితాభిప్రాయము.

గుడివాడ బోర్డు హైస్కూలు సంస్కృత పండితులును, శతావధానులును, వేదమూర్తులు నగు విద్వాన్ భమిడిపాటి అయ్యప్ప శాస్త్రిగారీ విధముగా దమ యభిప్రాయ మిచ్చియున్నారు.

చం. సరస పదార్థ భావవిక సత్ప్రమసార రస ప్రసారిత
స్థిరకవితాను రాగమున జెన్నలరారి, స్వవృత్తి వృత్త భా
సుర పరి వర్తమానమయి సుందర బంధుర రూపదీప్తమై
శరదనురూప సత్కళను జంద్రికయై, విలసిల్లి మించి య
ద్దిర! కలవాణి బాలకవి తిర్పతిరాయని నాటకంబు, స
త్వర గతి దృశ్యమానమయి ధర్మము గైకొని, సత్యవాక్య వి
స్ఫురిత మహానుభూతి, గడు శోభిలి, యున్నది చంద్రసూర్యమై
సురుచిర కీర్తి గాంచుత, వ సుధర శ్రీ ఘనసార సారమై.
...ర వింతదనరి
...వి నయము నింపు
...జ గాన వృద్ధి
...్వాహ మనుదినంబు.

---

...జదువ నభిలాష కలదేని మాగ్రంథమం
...డనున్న అరిందవిజయకునురహాస్యాపరా
...మునే చదువుడు. ఆంధ్రమున నిట్టి
...బ్రకటింపబడి యుండలేదు.
...గ్రంథములను బొందదలచిరేని మా
...టనే కాన నేడే చందాదారులుగండు.
...ప్రబోధినీగ్రంథ నిలయము.

మండపల్లి.

లింగాలపోస్టు,

# అంకితము.

శ్రీ మదగణిత గుణగణాలంకృతుండును,

పుణ్యశ్లోకుండును,

శ్రీ సూదాన్వయ దుగ్ధార్ణవోద్దీపిత రాకాసుధాకరుండును,

మూర్తి మహానామాంకితుండును

కీర్తిశేషుండును,

నగు

అస్మన్మాతులునకు

భక్తి పురస్సరముగా. ఈ. నాచే రచియింపఁబడిన

ఉర్వీసుతోద్వాహము

సంకితముగా సమర్పించుచున్నాఁడను.

ఇ॥ తి॥ రా॥

# పీఠిక.

సదయ హృదయులగు నో మహాజనులారా !

చిన్న మనవి—

విద్యాంగలక్షణ గ్రంధములే నెక్కువగాఁ బరిశీలింపకున్నను, అస్మద్గురువర్యు లగు బ్రహ్మశ్రీ చిల్లర వేంకటేశ్వర కవిగారి విద్యా వర ప్రసాదము వలన నించుక కవితాధోరణిమాత్రము నాకీయల్ప ప్రాయంబుననే సంప్రాప్తమైయుండెను. మండవిల్లిగ్రామ వాస్తవ్యులును, మాతృభాషాభిమానులును, మత్ప్రియ మిత్రులును నగు మ॥ రా॥ శ్రీ॥ అద్దేపల్లి సత్యనారాయణగారు శ్రీ మత్సకలోద్భవస్థితిలయకారణభూతుండును, భక్తజన సులభుండును, బరమాత్ముండును, బరమేశ్వరుండు నగు శ్రీమన్నారాయణు లీలావతారంబులలో శ్రీ రామావతారముం గూర్చి కౌశికుండు దశరథుని కొలువుకూటంబున కరుదెంచి శ్రీరామలక్ష్మణుల యజ్ఞరక్షణార్థము పంపుఁడని వేఁడుట మొదలు దైత్యదండనమును, దీక్షారక్షణమును, అహల్యా శాపవిమోచనంబును,హరచాపఖండనంబును, గావించి శ్రీరామచంద్రుఁడుసీతాసతీరత్నమును బరిణయమై యటనుండి మరలి వచ్చునప్పుడు పరశురాముని గర్వభంగంబు గావించి పురప్రవేశమగువరకు నాటకరూపముగా వ్రాయుఁడనియు, నచ్చొత్తించుటకు వలసిన ద్రవ్యసహాయము నేఁ జేతుననియుఁ జెప్పి నన్నీకార్య నిర్వహణమునకుం బురికొల్పుటచే నా యల్పజ్ఞతనైనను విచారింపక నా మిత్రుని పలుకు లంగీకరించి యేతద్రచనా విధానమునకుం గడంగి యత్యల్పకాలములో నియ్యది పరిసమాప్తి నొందించి నా మిత్రుని సఫలీకృత మనోరథునిఁ గావించి తన్మన్ననలకుఁ బాత్రుఁడ నైనందులకే నెంతయు ధన్యుఁడను.

నా మిత్రులు మఱికొందఱీ కథాసందర్భమున నచ్చటచ్చటఁ గొన్నిపాటలు వ్రాయుఁడని నన్నుఁ బ్రేరేపించుటచే నేనట్లొనరించి యిందనుబంధముగాఁ జేర్చి ముద్రించితిని, గావున నో చదువరులారా!

లక్షణగ్రంథములను బాగుగాఁ బరిశీలించి యుండలేదని మొదట నే విన్నవించితిని గదా! నా యీ కొఱంతవలన నిందచ్చటచ్చటఁ బొల్లులేవేని యున్నచోఁ గరుణార్ద్రదృష్టితోఁ బరిశీలించి నాకుఁ దెలియఁజేసిన యెడల మఱొక్క కూర్పునందవి సవరించుకొనెదనని వేఁడుచున్నాఁడను.

మండవిల్లి.
18-3-23.



ఇట్లు,
మీ విధేయుఁడు,
ఇక్కుర్తి తిరుపతిరాయఁడు.



## ఈ నాటకమున వచ్చు పాత్రలు.

### —। పురుషులు ।—

శ్రీరాముఁడు—కథానాయకుఁడు.

లక్ష్మణుఁడు
భరతుఁడు
శత్రుఘ్నుఁడు } శ్రీరాముని తమ్ములు.

దశరథుఁడు—శ్రీరాముని తండ్రి.

జనకుఁడు—కథానాయిక తండ్రి.

దేవేంద్రుఁడు—దేవరాజు.

సుమంత్రుఁడు—దశరథుని మంత్రి.

వసిష్ఠుఁడు—దశరథుని కులగురువు.

పరశురాముఁడు—భగవదవతారమగు ముని.

విశ్వామిత్రుఁడు
గౌతముఁడు } మునులు.

శతానందుఁడు—జనకుని పురోహితుఁడు.

శాయన్నశాస్త్రి
అమర్తావధాని
చల్లమయ్యాచయనులు } బ్రాహ్మణులు.

మారీచుఁడు
సుబాహుఁడు } రాక్షసులు.

ఇంకను సందర్భానుసారముగా రాజులు, మునులు, నావికులు, భటులు మున్నగువారు వత్తురు.

### —। స్త్రీలు ।—

సీత—కథానాయిక.

కౌసల్య—రాముని తల్లి.

ఊర్మిళ—లక్ష్మణుని భార్య.

మాండవి—భరతుని భార్య.

శ్రుతకీర్తి—శత్రుఘ్నుని భార్య

అహల్య—బ్రాహ్మణి

కుసుమగంధి—కౌసల్య చెలికత్తె.

చారుమతి—జనకుని భార్య.

తాటక—రాక్షసాంగన.





ఓమ్.

# ఉర్వీసులోద్వాహము.

C. M. V. Sharma
Nalgonda

నాంది।

శా. శ్రీమల్లోకచయంబు దానవిధియై సృష్టించి లక్ష్మీశుఁడై
వ్యామోహంబునఁబెంచి భీమమునను ద్యత్ప్రౌఢిమం దుంచియ
వ్యామోదంబెనయం ద్రిమూర్తులకు బాహ్యాకారుఁడై కాలుశ్రీ
రామస్వామి కృపాకటాక్షయుతుఁడై రక్షించుమిమ్మెప్పుడున్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి]

సూ.— ఆహా ! నేఁడు కనులపండువుగా నిమ్మహాసభికుల సందర్శించి హర్షించు భాగ్యముసకుఁ దోడుగా నీ మలయమారుత మెంత మనోహరముగా వీచుచున్నది ! ఓహెూ ! ఇది వసంతర్తువు కాఁబోలు. వహ్వా ! జీవకోటికీ ఋతువెంతయు మహోపకారి గదా !

సీ. క్రొమ్మావి చిగురుల నిమ్ముగా భక్షించు
కోయిలతతికి మక్కువపుబంట
మితిలేనిమశక సంతతితోడ బాధింప
బగుపశుతతికిన వ్యంపుస్వర్గ
మందమాకుసుమా యానమాధుర్యంబు
గ్రోలు తేంట్లకుసొంపుఁ గూర్చువిందు

సుగుణసంపత్తిచే నెగడు యోగీశ్వర
శ్రేణికెంతయుఁబోఁదిసేయు వెలుఁగు

తే. గీ. అరయ సాయంతనపు వేళ సిరులుగలిగి
యలరుజనులకు నసివారు సలుపఁదగిన
సద్విశాలము నాఁగనీ జగతిసంత
సంబుగూర్చెడు నెపుడు వసంతమహహా.

భళిరా ! ఈయానందమునకుఁ దగినట్లఘ వినాశనకరంబును సర్వజన మనోల్లాసకరంబునునగు గాథ నెద్దియేని ఖేలన మొనరింపుఁడని ప్రాజ్ఞులైన యీ ప్రేక్షకులచే నాజ్ఞాపింపఁబడి యుంటినిగదా ! వీరి మనంబుల నెద్దానిచే రంజింపఁ జేయఁగలను. (ఆలోచించుచుండును)

[నటుఁడు ప్రవేశించును]

న—బావా ! ఎద్దియో దీర్ఘాలోచనము సేయుచుంటివి ?

సూ—మిత్రమా ! నీవు సమయమునకు విచ్చేయుట భగవత్సంకల్పముగా నున్నది.

న—అట్టివిషయ మెద్దానిని గుఱించి ?

సూ—రసిక శిఖామణులైన యీసభాసదులచే ముముక్షుజనానందకరమగు నొక నాటకమును బ్రదర్శింపుఁడని యాజ్ఞాపింపఁబడి యుంటచేత నద్దానిని గుఱించి విచారించుచుంటిని.

న—బావా ! ప్రాజ్ఞుఁడవయ్యును బామరుసరీతి విచారింతు వేటికి ? ప్రదర్శనమునకు భక్తిరసప్రధాన నాటకము లేకలవయ్యా నా? ఇటువినుము.

సీ. ఏలోకుపాదర జోలేశమున నహ
ల్యాదేవిశాపకా యమును బాసె
నేదేవునిర్మల పాదాంబువులుగోలి
హనుమద్విభీషణుల్ ఘనతఁగనిరి

యేమహాత్మునిదివ్య నామంబు స్మరియించి
ప్రహ్లాదనారదుల్ పరముగనిరి
యేయద్వితీయు సహాయంబునం జేసి
గాధితనూజుండు గ్రతువొనర్చె
తే. గీ. నేపరంధాము గుణధాము నెంచిమునులు
ఘోరభవవార్ధినీదంగఁ గోరుచుందు
రట్టిరఘురాముకథవినా యన్యమైన
కథలబుధజనవర్గంబు గనునెతనివి.

సూ—శౌనాను ! నేనింతదనుక మఱచితి. నవీనముగా బాలకవి "యుర్వీసుతోద్వాహ" మనుపేరితో రామాయణమునం దలి బాలకాండాంతర్గత కథను నాటకరూపమున రచియించి యుండె నయ్యది ప్రదర్శనానుకూలముగా నుండునని తోఁచెడిని.

న—బావగారూ ! చెప్పరైతిరి ? ఇంతదనుక నుర్వీసుతోద్వాహమను పేరు వినసైతిని. దానిని రచించిన బాలకవి యెవరు ?

సూ—ఎఱుఁగవా ? అటులైనఁ జెప్పెద నాకర్ణింపుము.

సీ. మితిలేని పతిసేవ నతిశయిల్లెడు సాధ్వి
బుచ్చమ్మతలఁపనే పురుషుజనని
సంతతహరిపాద జలజసేవారతుం
డంకమ్మయెవ్వాని కనుఁగుదండ్రి
చిల్లరాన్వయదుగ్ధ సింధుసోముఁడు వేంక
టేశ్వరకవివరుం డే నిగురుఁడు
నిరతసత్యస్ఫూర్తి నెగడుసూదామూర్తి
మనసీయుఁడెవ్వాని మాతులుండు

తే. గీ. విమలవిజ్ఞానమయమయి వెలయుచుండు
నట్టియిక్కర్తిసద్వంశ మందుఁబొడమి
నియతిగురువులనాజ్ఞచే నెగడునెవ్వఁ
డట్టితిరుపతిరాయఁడి య్యదిరచించె.

న—అటులనా! యతఁడు నిన్నమొన్నటివాఁడుగదా! అప్పుడే నాటకరచనాసమర్థుఁడయ్యెనా?

సూ—నీయట్టివాఁడట్లు తలంచుటచూడఁ గూపస్థమండూకమువలె నుంటివని తలంచెదను. బాలుగకిప్పుడు సులభముగా విద్యఁ గఱపు పండితశిఖామణులు త్రోవఁ జూపుచుండ నిఁక నీగ్రంథకర్తవంటివారికిఁ దఱుఁగేమి? అట్టితఱి సకలసద్గుణ గణవిరాజితులును, సర్వజనశ్రేయోభిలాషులును, విద్యార్థిజనమందారులును, సన్నుతశీలురును, విద్యావినయసంపన్నులును, అష్టావధాన శతావధాన సమర్థులును, విచిత్రపుహూరవ, ప్రహ్లాద, శ్రీకృష్ణవిజయ, హరిశ్చంద్ర, పృధ్వీరాజ విజృంభణ, శ్రీరామజనన, కుశలవాభ్యుదయ, భరతాభ్యుదయ, సారంగధరోత్తర గ్రహణాది వివిధగ్రంథకర్తలునునగు బ్రహ్మశ్రీ, చిల్లరవేంకటేశ్వర కవిగారు మనగ్రంథకర్తకాజ్ఞులైయుండ నీట్టిరచనయన నెంత?

న—ఐననది విబుధజన సమ్మతమగునా?

సూ—కాదు! కాదు! అట్లునేనే చెప్ప సాహసించితిని; కాని గ్రంథకర్త యిట్లు మనవిసేయుమనియెను.

న—ఎవరికి?

సూ—సుధీలోకమునకు.

న—ఏమని?

సూ—ఇట్లు.

తే. గీ. తప్పులేనట్టివారలు కొ ధరణియందు
నెందునను లేరు కావున కొ నిందు నెచట
నెరసులున్నను వీక్షించి కొ నిపుణమతిని
దెలియఁ జేయంగ వేఁడెదఁ కొ దెలుపరయ్య !

ఇంకఁ బామరులన్ననో.

తే. గీ. శ్లేష్మమాసిటితో నిండి కొ చెలువులుండఁ
గ్రుపుచే మాఁగు బురద గుం కొ టలను వెదకు
పందుల విధాననొప్పుల కొ వదలితప్పు
లనుగ్రహింతురయ్యది నైజ కొ మనిగలంతు.

అట్టివారినిందఁ బేర్కొన నేల? కాలహరణమగుచున్నది. శీఘ్రముగాఁ బాత్రిలను సిద్ధపఱచెదము పద.

స—మంచిది.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.





# ఉర్వీసుతోద్వాహము.

## ప్రథమాంకము.

### 1 రంగము:—అయోధ్య—సభాస్థానము.

(దశరథుఁడు, సుమంతుఁడు, వసిష్ఠుఁడు ప్రవేశింతురు.)

ద—మంత్రీ! సుమంతా! మదీయరాష్ట్రమునందే కొఱంతయులేక,

చం. జనులునిరంతరంబుహరి సచ్చరణంబులఁ బూజసేతురే?
తనువులు బుద్బుదంబులని ధర్మపథంబున సంచరింతురే?
యనయము నెవ్వ చేవనరు సర్థులఁ బ్రేముడి గారవింతురే?
వినయము సత్యముంగలిగి విశ్రుతకీర్తిగడించు చుందురే?

మఱియుఁ జాతుర్వర్ణంబులవారును స్వకులోచితధర్మంబును విడనాడక శమదమాది సద్గుణములు గలిగి నిరంతరధర్మవర్తనులై మనుచున్నవారలే కదా!

సు—(1) దేవా! ధర్మతత్పరుండవగు నీవు ప్రజాపరిపాలనమునకు బద్ధకంకణుఁడవైనది మొదలు జనులారోగ్యవంతులై సత్యసంధులై ధర్మవర్తనులై శాంతిపరులై శ్రీయుతులై దైవభక్తిపరులై చెన్నొందుచుండిరి.

ద—అమాత్యా! సరియే. యీసంగతియటుండనిమ్ము. మత్కుమారులు ధనుర్విద్యాభ్యాసమందు తీర్ణులైరని నిన్న నెవరివలననో వినియుంటిని. వారిసంగతి నేమైనవిచారించు చుంటివా?

సు—ప్రభూ! విచారింపవలసినదేమి? ప్రతిదివసము నొకగడియ కాలమైనను భవదాత్మజుల ధనుర్విద్యా కౌశలంబు పరీక్షించి యానందించుచుందును.

ద—అటులనా? సరియే వారల విద్యాసంపద నీకేమైననచ్చినదా?

సు—దేవా! నచ్చుకేమి! ధనుర్విద్యయందు మీకుమారుల పాండితీ గరిమ మత్యద్భుతము! నద్వితీయము!

తే. గీ. ధనువుకరమునఁ దాల్చుటయును శరంబు
వింటసంధించుటయును, వేవేయుటయును
నారిలాగుట, కూర్చుట బీర మొప్ప
విల్లువంచుటత్రుంచుట వేడ్కగాదె?

ఇంతయేల? వారి ధనుర్విద్యా ప్రదర్శనమెంతయని నొక్కి వక్కాణించుటకా సహస్రముఖములుగల యాదిశేషునికైన నలవికాదు.

ద—ఏమినాభాగ్యము! అంతధనుర్వేద పారంగతులైరా! ఇక నాకేమికొదువ? ఆహా లోకంబునఁ దనయులఁ గన్నవారలే కదా ధన్యులు.

సు—స్వామీ! ఒకతనయులంచేకాదు. మీరు సమస్తైశ్వర్యంబుల సమంబుగాఁ గ్రాలుచుంటిరి ఏమన.

మ. ధనమాకొల్ల, యమాత్యులాతఱచు మేల్ దాసీజనంబుండె, నం
దనులా చాలున, బంధువుల్ గలరిఁక ధాన్యంబుసంపూర్తి, వా
హనముల్ పెక్కులు, మిత్రులక్షయ,మహా యన్నింటధన్యుండవో
జననాథాగ్రణి! యేరికైననిటుల ప్టైశ్వర్యముల్ గల్గునే?

భద్రుఁడు—(ప్రవేశించి) అయ్యా! ద్వారముకడ విశ్వామిత్ర మహర్షి మిమ్ము దర్శింప వేచియున్నాఁడు.

ద—భద్రా! వారిసవశ్యముగా లోనికిం దోడుకొనిరమ్ము.

భ—చిత్తము (నిష్క్రమించి మరలఁ గౌశికునితోఁ బ్రవేశించును)

ద-సు—మౌనిచంద్రమా ! నమస్కారములు.

వి—ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిరస్తు. పుత్రపౌత్రాభివృద్ధిరస్తు.

ద—తమరీ పీఠ మలంకరింపుఁడు

వి—మంచిది (కూర్చుండును)

ద—

కం. దేవర పాదము పెట్టుటఁ
 బావనమయ్యెను గృహంబు ♦ భద్రంబొదవెన్
 దేవరదయార్ద్ర దృక్కుల
 భావంబునఁ శంక లెల్లఁ ♦ బాసె మహాత్మా !

మహాత్మా! ఘోరారణ్యంబునందలి మీయాశ్రమంబునఁ గ్రూరమృగ భయంబు లేక నిరపాయంబుగాఁ బ్రొద్దుపుచ్చుచుంటిరిగదా ?

వి—వితతగాంభీర్య ధైర్య స్థైర్య ధురంధరుఁడవును, నవక్రపరాక్రమ విజృంభిత యశోవిశాలుఁడవును నగు నీవు రాజ్యమేలుచుండ మాబోఁటి మునులకేకొఱంతయు నేల కలుగును.

ద—అదియు మీ యాశీర్వచన ప్రభావమే. స్వామీ తమ రూరక విచ్చేయరు. కారణ మెఱింగింతురా ?

వి—సత్యవాక్పరిపాలనాధురంధరా ! దశరథ భూమీశ్వరా ! నేనొక స్వల్పకార్యము కలిగియే వచ్చితిని.

ద—స్వామీ ! అదేదియో సెలవిండు.

వి—సెలవిచ్చుట కేమున్నది. బహుస్వల్పము.

ద—దేవా ! యెంతకార్యమైననేమి. బయల్పఱుపుఁడు.

వి—“తప్పక యొసంగెద” నన్నఁ జెప్పెదను లేకున్న సార్థకమేమి ?

ద—(స్వగతము) ఏమిది యీమౌని యింతకపటముగా మాటలాడుచున్నాఁడు ? కారణమేమైయుండును ? ఇచ్చెదననినఁ జెప్పెదననుచున్నాఁడు రాజ్యమేమైన నిమ్మనునా ? చిరకాలము రాజ

భోగము లనుభవించి రుచింపమిఁ దుదకుఁద్యజించి సర్వసంగ పరిత్యాగినై యెక్కడనో ఘోరారణ్యంబుల మున్కమూఁపి కొని తపమాచరించు కొనుచున్న నాకిఁకీరాజ్యకాంక్ష యేల క లుగును? అందునను బహుస్వల్పమనుచున్నాఁడే. పోనీ యేది యైన నేమి. (పరితాపముగా) స్వామీ! నావలన నగునదియు ధ ర్మవిరుద్ధంబు గానిదియు నైన నిచ్చెద.

వి—లేదు. లేదు. ధర్మవిరుద్ధమేమియు లేదు. నీవలన నగునదియే.

ద—అట్లులైనఁ దప్పక యొసంగెద సెలవిండు.

వి—పలికి బొంకవుకదా!

ద—దివాకరశశాంకరులు తమతమ మార్గంబులఁ దప్పినను దప్పను.

వి—అటులైన నోరాజేంద్రా! (2)

మ. ఘనదీక్షన్ సవనంబొకండు సలుపం గాఁదోఁచె రక్తంచరుల్
వినువీధిన్ బలలంబు నెత్తురులు నిర్భీతిన్ వెసంజల్లుచున్
ఘనముల్ విఘ్నమొనర్చుచుండిరి ధరిత్రీనాథ! యద్దానిఁగా
నను శ్రీరాముని లక్ష్మణుంబనుపుమా వైళంబహర్షంబునన్.

ద—(విచారగ్రస్తుఁడై) అయ్యయ్యో! రామలక్ష్మణులా రాక్షసుల ను నిర్జించి యజ్ఞరక్షణము సేయునది? ఎంతమాట!

కం. రాముఁడు బాలుఁడుగద! సం
గ్రామంబెటు సల్పిగెల్చు రాత్రించరులన్
నీమం బెటు కొనసాగెడి
నోమునివర! హాస్యమిట్లు లోఁదరుపసగునే?

దేవా! యేటికిట్లు పరిహాసమాడెదరు? తమ కవసరమగు కార్యమేది యో కోరుఁడు.

వి—(కొంచెము కోపముతో) ఏమీ! నేను నీతో ననవసర పరిహా సమాడుచుంటినా? చాలుఁజాలు. నీ కుయుక్తులీ కుశికనంద నునకడఁ జెల్లుననుకొంటివా యేమి?

ద—(దీనవదనుఁడై) తండ్రీ! కన్నులువిప్పని పసికూనల నిట్లు కయ్యమునకుఁ బంపుమని కోరఁదగునా? ఇంక నేమైనఁ గోరుఁడు. (3)

వి—అదిగో! మొదట నేనన్నంత యైనది. రాజా! ఎక్కడనో ముక్కుమూసికొని తపంబు సలుపుకొనుచుండు మాకింకేమి కావలసియుండును? క్రూరరాక్షసబాధ లనుభవింపలేక యిప్పటికీపని యవసరమై వచ్చితిని. కాదనుము నాదారిని బోయెదను.

ద—(గద్గదకంఠుఁడై) ఓ మునిచూడామణీ!

చం. అలఘుతపోనిధాన మహితాతిశయంబునఁ గ్రాలుచుండుని
శ్చలతర పుణ్యమూర్తివి ప్రజాపతిసృష్టికి మాఱుసల్పి చే
తలఁ బరాత్మభూయని సదాదివిజుల్ గొనియాడ ఖ్యాతిచే
వెలుఁగు మనోజ్ఞమూర్తి విటు వేడఁగ బాడియె సంయమీశ్వరా!

మఱియును,

ఉ. పిన్నలఁ బెద్దలం దెలిసి పేర్మిఁ జరించెడి యూహ లేదు పా
మ్మన్న నెదిర్చియాడ దక్షిణమంబును జాలఁడు వారలింతకున్
మున్నెపుడేని నాయసుర మూర్ఖులఁ గాంచియె యుండలేదకే
తెన్నున శాత్రవాలిని వధింతురు నా పసిపాపలక్కటా!

స్వామీ!

తే. గీ. సర్వసైన్యయుతముగ నచ్చటికివచ్చి
యజ్ఞనాశకులైన యా యసురపాళి
నెల్లఁ జీల్చి చెండాడెద విల్లుపట్టి
కల్లగాదాజ్ఞయిడు మునివల్లభుండ!

వి—(నవ్వుచు) ఓయి వెఱ్ఱిరాజా! నీవా వారలతోఁ బోరాడునది! వారి బలపరాక్రమంబు లిదివఱకెన్నఁడును విని కని యెఱుంగవు కాఁబోలు. చెప్పెద నాకర్ణింపుము.

మ. అవనీనాయక! రక్కసుల్ విపులగర్వాటోపబాహాబలుల్
దివిజాధీశుని చీరికింగొనక యాదేవాలి బాధింతురై
తవసంగ్రామమునందు ధూర్వహులు చేతంగాదయా నీకు నా
హవమందుం బడివారలం జెనక బాహాటోపశక్త్యున్నతిన్

సు—స్వామీ! మహారాజుగారివలనంగాని యీదుర్ఘటకార్య మీబాలురచేత నెట్లునిర్వహింపఁబడును?

వి—ఔనో! కాదో! నీకీవిమర్శ మేటికి? నిన్నెవ్వరిచ్చుటఁగోరిరి?

సు—(స్వగతము) అబ్బో! ఈచిన్నమాటకే యింతగా మండిపడుచున్నాఁడే! సమానముగా వాదముసేసినఁ గడంగిన యెడల నీకనఁబడునందఱయు భస్మము సేయునటులున్నది. కానియేదియెటులైన నాకేటికి?

ద—(భయముతో) దేవా! క్రతుహంతల నామములెఱింగినచో సెలవిత్తురా?

వి—రాజా! యెఱింగింతు వినుము.

మ. వినులంకాధిపుప్రాణబంధువులు దోర్వీర్యప్రతాపోదయుల్
సునయాపేతులు మేటిశౌర్యధురులుం సుందోపసుందాత్మజుల్
ఘనమారీచసుబాహులన్న వినవో కయ్యంబుగావింపవో?
చనవో? వారలఁగెల్వలేకయనిలోఁ దన్మానేశ యోజింపవో?

ద—(దుఃఖముతో స్వగతము) అయ్యయ్యో! కొంపమునిఁగినదే. యింకేమిచేతును? ఏదితెఱఁగు? ఇఁకనూరకున్నఁ బ్రయోజనము లేదు. కాళ్ల వ్రేళ్లఁబడి బ్రతిమాలుకొనియెద. (ప్రకాశముగా) దేవా! విల్లుపూనుటయు, నారిఁ గూర్చుటయు, లాగుటయు, బాణముసంధించుటయు, విడుచుటయు నెట్టిదో యెఱుఁగని చిఱుతలఁ గయ్యమునకంపుట మేరకాదు. కావున నావిషయమును నుఱచి యీసేవకునిఁ జరితార్థునిఁ జేయుము—

వి—(మిక్కిలికోపముతో) ఛీ. ఛీ. నిరంతరా నృతవాచాటా!

చం. విషయముతో నెసంగెదను వేడుమటంచును నాసపెట్టి మ
ద్విషయముఁ జూపెదేర! యది వేమఁడ! తుచ్ఛుఁడ క్షీరసాగరం
బున విషముప్పతిల్లినటు పుట్టితెమత్కులమెల్లఁగాల్పసీ
జనవరుఁడన్న దోసముభ్ర శంబగునిన్నను వాఁడునిందుఁడో.

ఛీ.ఛీ. దివాకరాన్వయ సంభూతులిదివఱకెన్నఁడైన నిట్టి యవా
చ్యంబులాడియుండిరా? కులపాంసనా! నీకొక్కనికే కాక క్ష
త్రియకులంబునకంతకును గళంకము తెచ్చితివిరా మూఢా!
మదన్వయసంభూతుఁడవై కులగౌరవమైనను బాటింపక, మత్త
పశ్శక్తినైనను గణింపక యబద్ధములకు లోనైతివటరా?

ద—(వణఁకుచు స్వగతము) అయ్యో! మునికంతకంతకుఁ గోపము
హెచ్చుచున్నది! ఇఁక నెప్పుకొనకతప్పదు. దైవమా! యెంత
చేసితివి! ఆలసించినమునిశపించునేమో (ప్ర) గురువరేణ్యా!
సేవకుని కావైరులఁ బాఱఁదోలఁగల సామర్థ్యములేదా?

వి—లేదులేదు. వేయేటికి?

తే. గీ. ధరణిభారంబు దీర్పను ద్భవమునొంది
వరలుశ్రీరామునకుఁగాక యరులఁగూల్ప
నన్యులకువశంబగునె? యో యధప! యతఁడు
కుఱ్ఱఁడనిసీమనంబునఁ గుందవలదు.

కావున మత్క్రతకక్రతు రక్షణార్థము రఘువంశ జలధి సోముండగు
రాముని నవశ్యము సంశయింపక పంపుము. దాన నెల్లరకు శ్రేయం
బగును.

ద—(కరములుమోడ్చి) స్వామీ! భవదాజ్ఞనతిక్రమింపఁ జాలను;
గాని లేక లేక యనేక కష్టంబులంబడి తుట్టతుదకు దైవానుగ్ర
హంబున నీ కుమార చతుష్టయముంబడసితిని. అందుఁగందువు

లగుటచే భీకరాకారులగు రాత్రించరులతోఁ గయ్యమునకుఁ
బొండన నోరురాదయ్యె. (విశ్వామిత్రునితో) అయినను భూత
భవిష్య ద్వర్తమాన కథావిదులరగు మీరు చేయూఁతగా
నున్న వారల కేదోసంగులును బొసంగ నేరవనెడు నమ్మకంబు
నఁ బంపుచుంటిని. గాన్పున సమస్త భారము మీాయదియే.

వి—(సంతోషముతో) రాజా !

చం. కడుపునఁగంటి వీవుమటి కన్నులఁగంటిని నేనటంచునీ
బుడుతలసేమ మూరయుచు బొంకుటకాదిది యెల్లకాలమూ
దడయఁగనేల నీమదిని ధైర్యమునూని కుమారులంబదం
పణివెనువెంటఁ బంపుము శుభంబగు నీకునుమాకు వారికిన్.

ద—సేవకా !

భ—దేవా ! ముదలయేమి ?

ద—నీవుపోయి రామలక్ష్మణులను సర్వాలంకార భూషితులఁగా నొ
సరించి శరశరాసన యుక్తులుగా నతిశీఘ్రింబునఁ దోడ్కొ
నిరమ్ము.

భ—చిత్తము (నిష్క్రమించును)

వి—రాజా ! నీకొక్క పరమ రహస్యంబెఱిఁగింతు నయ్యది యేరికిని
దెలియనీకు మదేమన ! (4)

మ. దురితాచారులు దుర్మదాంధులు మహా ద్రోహుల్ కృపావర్జితుల్
నరహంతల్ రజనీచరుల్ సురలన న్యాయంబుగాఁ బట్టి దు
ర్భరకష్టంబులు వెట్టుచుండఁగని శ్రీ వైకుంఠుఁడేయిట్టులీ
ధరణిస్సికు జనించె నందనుఁడుగా ధర్మంబు రక్షింపఁగన్.

ద—మహాభాగ్యము.

[రామలక్ష్మణులు ప్రవేశింతురు]

రా—
ల— } జనకా ! నమస్కారములు—మహాత్ముల కభివాదములు.

ద—దీర్ఘాయురస్తు (దగ్గఱకుఁ దీసికొనును)

ల—నాయనా! వీరెవరు?

ద—బిడ్డా! లక్ష్మణా! ఈయన విశ్వామిత్రమహర్షి.

ల—పెద్దన్నయ్యను నన్నును బిలువనంపితి రేటికి?

ద—నాయనలారా! మీరీ మునికుంజరుని వెంట నరుగవలయును.

రా—చిత్తమల్లే! యేటికి?

ద—ఇమ్మహాముని జన్నమొకటి చేయుచుండ రక్కసులు విఘ్నమొ నర్చుచుండిరఁట. తత్క్రతు రక్షణము సేయుఁడు.

రా—తండ్రీ! సెలవిమ్ము. మేమిప్పుడేపోయి యామున్రిక్కడి రక్కసులనుక్కడంచి వత్తుము.

ద—తండ్రులారా!

తే. గీ. దైత్యులా కామరూపులు దర్పితులుమీర
లాకుకర్మలనెల్లఁ జీకాకుపఱచి
యేచివధియించి జయము గ్రహించిమఱలి
వచ్చుటెట్టులోయని మది వనరుచుండె.

రా—తండ్రీ! మీయాజ్ఞయే యనుశిష్టము; కాని

ఉ. చించమె ఘోరయుద్ధమునఁ జిందఱవందఱఁ జేసి మేనులం
దూంచమె మత్కృపాణముల దుర్మతులన్ రజనీచరాలిఁ గ్రొ
క్కించమె నోటరక్తముల నేరులుగా ధరఁ బాఱునట్లు శో
ధించమె యెందుదాఁగినఁ బదింపదినీకిలఁగీర్తిఁదేమొకో.

ల—నాయనా (ని)

తే. గీ. మత్తులాసశాచరులను మర్దముఁ బాప
నన్న శ్రమపడ నేటికి నాజ్ఞనొసఁగు
డొక్కనిముసంబులోనె యా రక్కసుల వ
ధించి క్రతురక్షణంబుగా వించివత్తు.

దశ—(లక్ష్మణుని ముద్దిడుకొని) తండ్రీ! నీవంతటివాఁడవె యగుదు వు. కన్నతండ్రులారా!

ఉ. జ్ఞాతియు నా ప్రబాధువును జ్ఞానియు మానియు నైనయట్టి యీ తాతను వెంబడించి చని ధన్యత నెయ్యది మీకనుజ్ఞ తా నాతతచిత్తుఁడై యొసఁగు నయ్యది శ్రద్ధగ నాచరించి వి ఖ్యాతినిరంబు శ్రేయము సుఖంబును గన్గెదుఁగాత మీకిలన్.

వి—రాజా! ఇంక మేమరిగెదము.

ద—చిత్తము.

రా—<br>ల— } తండ్రీ! పోయి వచ్చెదము.

ద—కుమారులారా! జయమగుఁగాత. పోయిరండు. (6)

[విశ్వామిత్రి రామలక్ష్మణులు నిష్క్రమింతురు]

ద—అమాత్యా! మునివరున కెదురాడలేక చిఱుతప్రాయంబున నెవ్వ మత్కుమారులఁ బూర్వగీర్వాణులతోఁ బోరాటమున కంపితి వారెట్లు నిర్వహించి వత్తురో కదా! (7)

సు—దేవా! గాధేయుఁడన్న సామాన్యుఁడుగాఁడు. నీ కుమారులకే కీడును రానీయఁడు. ఏలయనఁ గేవలము మహత్తరమైన తన తపశ్శక్తిని వ్యయపఱుపఁ జాలక యీ మిషను బన్నెనని తోఁచెడిని. గనుక మీరు దీనికిఁ గుందవలదు.

దశ—మంత్రీ! ప్రతిజీవికిని బద్మభవుఁడెప్పటి కెయ్యది జరుగునట్లు లలాటమందుఁ బొందుపఱచి యుంచెనో యప్పటికయ్యది కీడు గాని మేలుగాని యనుభవింపక తప్పదు గదా!

సు—తప్పదు! తప్పదు! విరించికైనను దాను లిఖించిన వానిని దప్పింప నలవు పడదు.

ద—పోనీ! భవితవ్యమెట్లో యట్లు జరుగును. పొద్దుగ్రుంకుచున్న ది. సాంధ్యకృత్యములఁదీర్చుకొన నరుగవలయు.

సు—చిత్తము. (నిష్క్రమింతురు)

రెండవ రంగము—కౌసల్యాంతఃపురము.

(కౌసల్యయు గుసుమగంధియుఁ బ్రవేశింతురు.)

కౌ—(దుఃఖముతో) చెలీ !

చం. బుడుతలు లేరటంచు మదిఁ జింతిలుచుండ కౌక్కుచు నింతకాలమున్
గడపి తుదిన్ విభాండకుని నందను సత్కరణం గుమారులం
బడసిసుఖంపుచుండ మముఁ బాయఁగఁ జాలక తోడనీడ లై
నడుచుచును జెంగిలిపట్టములు నాదురదృష్ట మిఁకేమి చెప్పుదున్.

కట్టా ! ఏట్లతసంబున నెట్టికట్టములఁబట్టి తుట్టతుదకు నిన్నంటనిరాపట్టి! దుష్టజన సంకులంబై భయంకరంబై నిర్జనంబై నక్తంచరసంచారోపేతంబై యొప్పు ఘోరారణ్యంబున నీ వెట్లు నిర్భయముగాఁ బ్రవర్తింపఁ గలుగుదువు ? అయ్యో ! అగణ్యంబన్న నిదివఱకెన్నండును గనియుండలేదే ! పుత్రా ! నిర్దయుండై నీతండ్రి నిన్ను నుపునపుడు నాకైనఁ గబురంపినచో నేనైనను వచ్చి యమ్మని పాదములపైఁబడి బ్రతిమాలుకొని యీదుర్దశను దొలఁగించుకొందునే. బిడ్డా ! ఎంత యన్యాయము జరిగెను అయ్యో ! అయ్యో !

కు—తల్లీ ! నేనెన్ని చెప్పినను వినక యేల యీలీల బేలవై జాలిందూలెదవు ? ఊఱడిల్లు మూఱడిల్లుము.

కౌ—అయ్యో ! నాకెక్కడి యూఱడింపు ! ఎక్కడి శాంతము !

కు—అమ్మా ! నీకుమారుఁనికే కష్టంబులునురావు. ఏలయన

ఉ. అమ్మనిరాజువెంటఁదమ యాత్మజుల న్వెసఁబంపునప్పుడ
భ్రమ్మననిర్జరావలి సు భమ్మగురామునికంచు మీఁదఁ బు
ష్పమ్ములుసల్లిరింకఁబయి శాంతమునూని జయంబుగోరి ని
త్యమ్మును మేరలేనిప్రియ దమ్మునసుంచుము సౌఖ్యమయ్యెడిన్.

కౌ—సఖీ ! బుడుత నడవిపాలుచేసిన నాకెక్కడి సంతోష సౌఖ్యములు ?

తే. గీ. కన్నసుతుఁడని యైనను గరుణలేక
తపసికోరుట తడవుగా నృపతిసిబిడ
దుర్గమోగ్రవనంబులఁ ద్రోయనౌనె
యేమిచేయుదునావాఁత ముట్టులుండ.

కు—అమ్మా !

తే. గీ. రామునికసాధ్యమైన కార్యంబెయైన
మునివరుని వెంటఁబంపునే జనవిభుండు
ఏటికిటు దైన్యమునఁగుందె దీవ్రమిగుల
వసటఁదక్కను ధైర్యంబుఁ బదిలపఱచి.

కౌ—నెచ్చెలీ ! నీవెన్ని చెప్పినను నామదికూఱట జనింపదు. అయ్యో! రాత్రించరులతో సంగ్రామమేడ ! రాముఁడేడ ! హా స్త్రీమశ కాంతరము. వ్యాఘ్రరాజముతో బాలవృషభమునుబోరఁ ద్రోచులాగుననున్నదికదా ! ఇదియెంత వైపరీత్యము ! ఎంత దుస్సహము ! ఎంతసాహసము ! ఎండయు వానయుఁ గంటనె ఱుంగని పసిపాపఁడే ! అయ్యో! నాపుత్రరత్నమా !

సీ. కంటకదుర్గమయుత గహనవాటికి లెల్ల
నారామభూములా యన్న నీకుఁ
గాకగృధ్రబలాక కలకలారావముల్
ఘనపికస్వరములా తనయనీకుఁ
గర్కశగ్రావసం గమవనిమార్గముల్
రాజమార్గంబులా రామనీకు
వినికసతిసిరియెఱుం గనికందమూలంబు
లెన్నమిష్టాన్నమా గున్ననీకు

తే. గీ. నాకలంబులఁగప్పుము న్యాశ్రమములు
చిఱుత ! కాంచనసౌధని కరమెనీకు

సాటిమెటలేనిమేటిని । శాటకోటి
మీటునాటమె తండ్రి స । త్యాటనీకు.

బిడ్డా! నీవెప్పుడు నాకనుల కగపడుదువు! అయ్యో! యీ నిర్భాగ్యురాలి కట్టి భాగ్యముకూడనా?

సు. జననంబందినయప్డెపండితులుహా । ర్షంబారవిచ్చేసి కం
దునిలక్షించి "ధరాధినాథుఁడగు వం । ద్యుండౌ మహావీరుఁడౌ"
ననిభూషించిరి, కానియీగతినర । ణ్యావాసముఁగ సల్పువీఁ
డనియొక్కండునుబల్కఁడయ్యెనికనీ । యన్యాయమెందున్నదో?

కు—తల్లీ! యేటికిట్లు వాపోయెదవు?

తే. గీ. యజ్ఞహంతలఁగూల్చిజ । యంబుగాంచి
యధ్వరంబునురక్షించి । యశముఁ బెంచి
మునికిమోదంబుఁగూర్చినీ । ముద్దుసుతులు
పురికివత్తురు శీఘ్ర మా । పోమృగాక్షి.

కౌ.—సఖీ! నిజమెఱిఁగి పలుకుచుంటివా? నన్నూఱార్చుటకై పలుకుచుంటివా? అయ్యో! ఇంకెక్కడికి వచ్చుట!

తే. గీ. బాహుబలుఁడగుపూర్వగీ । ర్వాణులేడ
రామలక్ష్మణులేడ సం । గ్రామమేడ
జయముఁగొనివచ్చుటెడని । శ్చయముదలఁప
మేషమువృకంబుతోఁబోర । మేలుగలదె?

కుసు—అమ్మా! క్షత్రియధర్మమెఱిఁగియుండియు నిట్లుశోకించెదవేల?

తే. గీ. గురుజనాలినిబూజించి । దురమొనర్చి
వైరులవధించి యర్థుల । గారవించి
తండ్రియాజ్ఞఁబాలించి స । త్యమువచించి
వరలునాతఁడె క్షత్రియ । వంశభవుఁడు.

దానివలన నిరపరాధులగు మునివరుల నకారణంబుగా బాధించుచున్న రక్కసి మూఁకలఁబోకార్చి నీతనయులు జయంబుగొని రాఁగలరు.

దుఃఖింపకుము. దుష్టజన శిక్షణ శిష్టజన రక్షణుఁడగు శ్రీమన్నారాయణుఁడు సత్యము పట్ల సర్వదా సంతోష సంభరిత స్వాంతుఁడై నివసించియుండును. ఆతఁడే నిబుధులకుఁ దోడుకాఁగలఁడు. శాంతింపుము. మహారాజుగారు వచ్చుచున్నటులున్నది.

కౌ—ఏరీ ? ఎక్కడ ?

కు—అవచ్చెడినారే !

ద—(ప్రవేశించి) కుందరదనా ! చందురుని డిందుపఱచు నీ సుందరవదనారవింద మిట్లుకందియుండఁ గారణంబేమి ? ఇట్లుకుందుట యేల ? సంశయింపక చెప్పుము.

కౌ—(కంటనీటిని దుడుచుకొనుచు) అయ్యో ! ఏమని చెప్పుదును? కొడుకునడవిపాలుగాపంచిన నిర్భాగ్యురాలను గదా !

ద—ప్రేయసీ ! దానికా ? నీవట్లు శోకింపవలదు. తనయులు ముని కటాక్షమున దనుజులఁదునుమాడి త్వరలోనే శుభంబు లొంది వత్తురు.

కౌ—నాథా ! ఎక్కడి శుభము ? ఒక చెంపఁ బాలును వేఱొక చెంప వసయునుగారు పసిపాపలను జూచుచుఁ జేతులార మనుజపిశితాసృక్కుల నశనంబుగా మెసఁగు నిశాసంచారుల వాతఁబడుఁడనత్రోసితిరా ? అయ్యో! మనకుఁబిల్ల లెక్కువయ్యెరా ? నేఁడు తెల్లవారకమున్నె యీపాడుజడదారి మన కేడ దాపురమయ్యెను? కట్టా ! తమకేల తెలియక పోయెను ?

చం. పరిణయమైనదాదిమన ✽ పాటులనెల్లగణింప నేరకిం
దరముగు నేప్రియాత్మజుల ✽ ధన్యతఁగాంచిసుఖింపఁగాదె సు
స్థిరతరభక్తిహోమనము ✽ చేసినదధ్వరముల్ జపంబులుం
బోరిఁబొరిఁదానముల్ మఱియు ✽ భూసుర సేవలు సువ్రతంబులున్.

ద—ప్రేయసీ ! నీవు చెప్పిన చొప్పంతయు నెఱుంగుదును; గాని

తే. గీ. కైతవంబునయాచించె ◊ గౌశికుండు
నెఱుఁగకీగతినేదైన ◊ నిత్తునంటి
నన్నమాటనుజెల్లింప ◊ కున్నయెడల
ననృతభాషణుఁడనిజను ◊ లనరె నగరె?

ఆ కారణంబునఁ దనయులను మునివరుని వెంటఁ బంపితిని; గాని లేకున్న నేను మాత్రమింత యవివేకినా? ఆతాప సునితో నేను,, మీ వెంటఁజనుదెంచి మదయుతులగు దనుజులను సద మదమొనరించి భవద్దీక్షారక్షణ మొనరింతును. కుమారులను మాత్ర ము కోరకుఁ” డని పదింబది కాళ్లవేళ్లఁబడిబ్రతిమాలినను నతఁడు ప ట్టినపట్టు విడువఁడయ్యె నన్నేమిచేయుమందువు? అనృతమాడి దినక రాన్వయమునకుఁగళంకము దెమ్మందువా? (9)

కౌ—నాథా! తనయులా ఘోరారణ్యంబులలో నాకలంబులఁ బొట్ట లునింపుకొని యెట్లు మనెదరనుకొంటివి? తగుసన్నాహము తోఁ దమరును దోడుగానరుగ కుంటిరిగదా! అయ్యో! ఇంకె ట్లు నాముద్దులయ్యలనుజూడక ప్రాణములుభరింపఁగలుగుదును? (మూర్ఛిల్లును)

భ—దేవా! వసిష్ఠమహర్షి విజయముచేయుచున్నారు.

ద—అట్లైన వారినెదుర్కొని తోడి తెత్తమురమ్ము.

(నిష్క్రమించి వసిష్ఠునితోఁ దిరిగివచ్చును)

కౌ—(మూర్ఛ తేఱి) మహాత్మా! వందనములు (నమస్కరించును)

వ—శీఘ్రమేనస్నుషాప్రాప్తిరస్తు!

కౌ—తండ్రీ! నాకంతటి భాగ్యమెప్పటికిఁ గలుగును?

వ—పంక్తిరథపట్టమహిషీ! సకలధర్మంబులకు నాలవాలమనఁదగునీ వే యీలీల జాలిందూలనేమియు నెఱుంగని బేలలట్లు శోకాంత నొందఁగలదు? సుమిత్రాదేవియొక్క మనోనిశ్చయము వీరభా

షణములు సియెడఁగన్పడకున్నవే! చాలుఁ జాలు నూరకుం డుము.

కౌ—తండ్రి! కన్నకడుపుగదా! ఊరకుండుటయెట్లు?

వ—అమ్మా! నీతనయులు శుభంబుగానివత్తురు శాంతింపుము.

కౌ—స్వామీ! ఈయెడయని నాజడదారి కొడుకుల నడుగునపుడు, పుట్టినదాది మాయోగక్షేమములరయుచు మమ్ముద్ధరించిన మహనీయులు తమరైనను వలదని వారింపరైరికదా!

వ—నేనును భావిశుభంబుల యోజించియే యూరకుంటిని.

కౌ—దేవా! మీరునట్టులే సెలవిచ్చుచున్నారా? అయ్యో! రాజానుమతమే లోకానుమతముగదా!

వ—అమ్మా! అందఱు నట్లే వర్తింతురనుకొంటివా యేమి? దుఃఖాతురతతో నున్న నీకిప్పుడట్లే తోఁచుచుండును.

కౌ—తండ్రీ! మఱియుండకయడిగెదను. నాకొమరులకు నిజముగా శుభము కలుగునుగదా!

వ—ఓ తల్లీ! యెంత వెఱ్ఱిదానవు. నీవు దురపిల్లుటఁగాంచి కల్లబొల్లి మాటలల్లి నిన్నుఁ జల్లఁబఱచుచుంటిననుకొంటివా యేమి? వినుము.

ఉ॥ నీసుతుకై యబద్ధములు నేనిటఁబలికి నఁ బెద్దకాలముం
జేసిన నాతపంబు రహిఁ జెందునె లోకము విశ్వసించునే?
ఓసుతనాదుమాట మది నొప్పరికింపక ధైర్యమూని సం
తోసముతోడనుండుము సుతుల్ విజయంబున వత్తురెంతయున్

అమ్మా!

ఉ॥ జన్మముభిన్నముగ జలుపు పారవిహీనులఁబూర్వదేవులన్।
మన్నెనరింపఁగౌశికుఁడు మార్గమెఱుంగక నాదుభూరి శా

రోన్నతుఁడైన నీదు తన కేయుఁ ధర నెక్కుడు చేయ జేని న
త్యున్నతి వెల్లడింపఁగృప కేర్చఁ జనుదెంచెను గుంద నేటికిఁ॥ 10

మఱియు నీకుమారుండు మనవమాత్రుఁడు కాఁడు. చరాచరాఖిల విశ్వంబును సృష్టింపను బెంపను హరింపను సామర్థ్య మేమహనీయుని కింగలదో నిఖిలలోకంబులు నేమహామహుని బొజ్జనడంగియుండెనో చిన్నలకుఁజిన్నయుఁ బెద్దలకుఁ బెద్దయునై యెవనిమూర్తి యొప్పుచున్నదో యట్టి జగదంతర్యామి శ్రీమన్నారాయణుఁడే నీతనయుఁడు. ఇటు వినుము.

చం॥ ఖలులగురక్కసుల్ సురలఁ గాఱియపెట్టుచునున్న, శౌరి వా
రలపొగరార్చి మీఁదట సుజాలికి సౌఖ్యముఁగూర్పనెంచి భూ
వలయమునందు నీకు సుతుఁడై భాతిగనుద్భవమయ్యె నింక నో
జలజదళాక్షి ! కుందకుము శాంతము పూనుము మేలుకల్గెడుఁ

తే॥ గీ॥ రాముఁ డెన్నఁగ నాదినారాయణుండు
వినుము సౌమిత్రిఫణినేత విమలచరిత
లాభరతశత్రుఘ్నులు కరయశంఖ
చక్రములు నమ్మునామాటఁ జంద్రవదన !

కావున భాస్కరాన్వయ తేజోవిభాసితులగు శ్రీరామలక్ష్మణుల కసాధ్యంబగు కార్యమెయ్యదియు లేదు. మీరింక రామలక్ష్మణుల క్షేమంబుఁగోరుచుండుఁడు. నచ్చి తడవైనది. ఇంక నేఁ రుగవలయును.

ద—కౌ—మహాప్రసాదము (నమస్కరింతురు)

వ—నిరంతరభద్రప్రాప్తిరస్తు! (నిష్క్రమించును)

ద—(స్వ) ఇంతకుమున్నీ యింతవఱకు సంతాపమును రవంతయును సంతరింపఁజేయలేని నాబ్రతుకెంతయు హైన్యమని తోఁచినను మత్పురోహిత వచనామృతప్రషతంబుల నీకాంతసంతాపాగ్ని చల్లారుటచే నాజీవితమున కొకింత నవీనదశకలిగినది. హృద

యంబును గుసుటఁబడినది. సందియంబునంత మొందినది. ముదంబు నుదయించినది (ప్రి) ప్రియసీ! నేనుసభాస్థానమునకుం బోవుచుంటిని. నీవును లోనికింబొమ్ము.

కౌ—చిత్తము.

(నిష్క్రమింతురు)

గద్యము.

ఇది యిక్కుర్తి తిరుపతిరాయవిరచితోర్వీసుతోద్వా
హంబునం బ్రిథమాంకము.





# ఉర్వీసుతోద్వాహము.

## ద్వితీయాంకము.

(1 రంగము సరయూనదీపరిసరము.)

(రామలక్ష్మణులును గొంత వెనుక కౌశికుఁడును నడుచుచు బ్రవేశింతురు.)

రా—లక్ష్మణా! మునివరుం డెంతదూరమున నుండెనో చూడుము.

ల—అగ్రజా! అల్లదో! కనుచూపుమేర నున్నవాఁడు.

రా—సరియే! ఆయన వచ్చుదనుక నిక్కడఁ గొంతతడవు విశ్రమింతమా?

ల—అన్నయ్యా! విశ్రమించుట కేమి; కాని యీనిచులద్రుమంబును జూడుము.

రా—ఎచ్చట?

ల—ఆ గ్రంథిలంబునకు డాపలిప్రక్కన.

రా—ఔనౌను. నిండారఁగాంచిన పండువెన్నెలవలె సంపూర్ణప్రఫుల్ల ప్రసూనాంగియై చూచుట కెంతయు సంతసము గలిగించుచున్నది.

ల—ఔను! గాని బొగ్గులలోని మానికమువలెఁ గళావిహీనమై కనుపట్టుచున్నదిగదా!

రా—దేనివలన?

ల—గృహారామంబులఁ బొలుపారుచుండవలసినది యీ తరుగుల్మంబుల చెంగటనుండుటనట్లున్నది.

రా—అనుజా! దానికేమి?

తే॥ గీ॥ కిమఠకర్కటభేక ని కరము లలరు
చుండు సందర్భమునను మణు లుండవొక్కొ
ప్రమదవనముగంటక ద్రుమములుండ
వొక్కొ ? యీరీతి సందియ మొందనేల ?

లక్ష్మణా ! అట్లు జనించుట వాని పూర్వజన్మసంచిత కర్మఫలంబునంగ లిగెను. నల్లదే నాగపాశబద్ధుడగు రణవీరుని వలె దర్వీకరంబుచే జుట్ట బడిన యాగంధసారమహీరుహంబును జూచుచు.

ల—అన్నయా ! నాకీపాదపంబునుజూడమనంబున నొకచిన్నయూహ జనించినది.

రా—ఎట్లు ?

ల—చెప్పెద నాకర్ణింపుము.

చం॥ కలవర మొందిపన్నగపు గాటులకొండొకయుక్తితోచి తా
మలయజభూజమై లెసర మూరుతమెల్లను నైజబుద్ధినిం
చెలిసి బిలేశయంబు కసి దీఅనికెక్కడికేగెదంచు బె
ట్టలుకనుజుట్టెవాలమున నన్నవిధంబునదోచెజెల్ల రే.

రా—లక్ష్మణా ! ఎంతగానూహించితివి ! (ఆనందముతో) వహ్వా మంచియూహయే ; కానియిటకెటనుండియో శీతలవాతమే తెంచుటయేకాక జలఘోషంబులుగూడవినవచ్చుచున్న వే. యేమై యుండును.

వి—(కలిసికొని) బాలులారా! అదియేసరయూస్రవంతి. ఆమ్రోగిన లు నదీప్రవాహసంజనిత తరంగఘోషలు అయ్యవి !

ఉ॥ తాటకగీటడంప గుణ ధాముడు రాముడు వచ్చుచుండె నిం
కేటికి మానులార ! నగ పేటికి ? నిర్జరులార ! చింత ? మీ
పాటులడంగదైత్యతతి పాటనముల్నిదురించె శుక్ర శి
ష్యాటవిలో దవానలము వ్యాపనమయ్యెనటంచుదెల్పెడిన్.

రా.—భవదనుగ్రహపాత్రులమైన చో ల్లీయగును.

వి.—(సరయూనది సందర్శించి) రామా! యిదియే సరయూనదీమత ల్లి. నావికులదేయోడ నాదరినుండి యీదిక్కునకు నడుపుకొని వచ్చుచుండిరి. ఇంతలోనే మజ్జనంబాడివచ్చెదం మీరీరసాల వృక్షంబుకడం గొంతతడవు విశ్రమించి మార్గాయాసముం బొ పుకొనుడు. (నిష్క్రమించును)

ల.—అగ్రజా! ఈనదీతోయము లెంత నిర్మలముగా నున్నవో చూ డుము.

రా.—ఔను! నిర్మలముగా నుండుటచే నిందలి జంతుసంతానమం తో వింతగగనగుచున్నది.

ల.—అన్నయ్యా! ఈ విశేషముం దిలకింపుము.

తే॥ గీ॥ పొదిగిటనునున్నబిడ్డల ఁ వదలితల్లి
మేతకొఱకేగె నింతలో ఁ మీనుపిల్ల
లెల్ల నేటికొ భయమొంది ఁ యిల్లు వెడలి
పాఱుచుండెను జీనుల ఁ బారుకరణి.

రా.—అప్పుడడె మెల్ల మెల్లఁగఁదల్లిని గలసికొని నీటిపైఁ దేలియాడుచు న్నవి.

ల.—అగ్రజా! ఈ నదీతరంగసంజనిత శీకరసంకలితమై వీచుచున్న యీానుల ననిలంపుసోకున నాకుఁబగటిపూటనే నిద్దురవచ్చు చున్నది.

రా.—అనుజా! ఉల్లంబుఁ బల్లవింపఁజేయు నీచల్లని యిసుకతిన్నెలపైఁ బరుండిన హంసతూలికాతల్పంబులు సయితం మనవసరముగాఁ దోఁచుచున్నది.

వి.—(ప్రవేశించి) రామలక్ష్మణులారా! నారేనావికులు. పడవ యీా వలిదరికి సమీపించుచున్నది. పోదముర౦డు.

రా—ల—చిత్తము (నిష్క్రమింతురు)

(2 రంగము సరయూనది.)

(పడవనడుపుకొనుచు నావికులు కనుపింతురు.)

1—ఒరేయ్! మొన్నెల్లిన సన్నాసాయనలాగుండాదురా ఈయన?

2—ఆనే కాంవాలిరా (ఆలోచించి) నిజంగా ఆయనేరా.

1—అయితే యీపిల్లోళ్ళోర్రో?

2—ఆరిబాబో! యెంతచక్కనోళ్లురా! ఆ మొకాలేం. ఆ సేతులేం, ఆ సొమ్ములేం, ఆసోకులేం, అంతా రాజుకొడుకులల్లే వుండారురా.

1—నిజమేరా కూత్తిపిల్లల్కి బాణాలుకూడా వుండాయిరా.

2—ఒరే! యీ బైరాగాయన పేరేంటిగా?

1—యిశ్వామిత్తులోరు కాదంటరా.

2—ఆమాటే తేపా మరిసిపోతుంటా గేపకం వుంచుకొంటాలే.

1—ఇయ్యాల యేఱు మాజాయిగా వుండదోయ్.

2—నావ తిరుగడపడతుండది. మూలగోయ్ మూలగోయ్

1—తెడ్డేయి తెడ్డేయి వొడ్డుకెల్లి నిలగడ్తా (దిగి కట్టివేయును)

(విశ్వామిత్రి రామలక్ష్మణులు ప్రవేశింతురు)

వి—ఏమిరా! ఇంతయాలస్యము చేసితిరి?

1—లేదండిబాబు! సద్దిగుడిసి వత్తుండాం బాబు!

వి—సరే! కుమారులారా! నావపైనెక్కుడు.

రా—ల—చిత్తము-(ముగ్గురును బడవనెక్కుదురు)

1—సామీ! సక్కనయ్యోరెవరండి!

వి—వీరు రాజకుమారులు.

2—ఆమాట మాకు తెల్సులేండి.

వి—మఱియేమి చెప్పవలయును!

1—వోరికొడుకులో అని

వి___దశరథమహారాజుకొడుకులు.

2___ఆ పెబోరికి నలుగురు కాదాండి బిడ్డలు?

వి___ఔను. (రామునిజూపి) ఇతడు పెద్దవాడు. పేరు శ్రీరాముడు.
(లక్ష్మణునిజూపి) ఇతడు మూడవవాడు లక్ష్మణుడందురు.

1___(2 వ వానితో) మాదొరోరి కడుపు పండిందిరా.

2___ఔనురా! సక్కనయ్యలు ముద్దొత్తుండారురా.

1___వదులోయ్ నావను. అగ్గెక్కుతుండది.

2___(వదలును పోటుగాలికిఁ బడవ సుడిఁబడి వెనుకకుఁ దిరుగుచుం
డును)

1___ గాలికి జాలునపడుతుంది మూలగోయ్ మూలగోయ్.

2___ఓరబ్బా! గెడందటం లేదురా.

1___డమానుమీఁదికెల్లి చెవ్వుతిప్పు చెవ్వుతిప్పు.

2___(పడవను దోవకుఁదిప్పి సరిగా నడిపించుచుండును)

రా___లక్ష్మణా! ఈనదీదేవత యెంతరమణీయముగా నొప్పుచున్నదో
చూడుము.

తే॥ గీ॥ జలచరంబులె పువ్వు సం । చయముగాఁగఁ
బాలుపానీయమే కేశ । పటలి కాఁగ
ధరణిదేవత మురువుగాఁ । దాల్చినట్టి
వేణియోయనహ్రదిని । వెలయుచుండె.

ల___అన్నయ్యా! ఈనదీతీరములం దిలకింపుము.

తే. గీ. ఆయువుసమాప్తి జీవికి । నైనపిదప
రమ్మురమ్మని జముబంట్లు । క్రమ్మునరణి
ఝషములనుబట్టి మెసఁగద్వి । జంబులెట్టు
లిరువెసల నాక్రమించెనో । కరుణమాలి.

వి___(స్వ) ఏమీరుమారుల యూహావిశేషములు!

నావి—(పడవదగ్గఱికిఁ జేర్చి) దిగండి బాబు!

వి—మంచిది. బాలకులారా! రండుపోదము.

(అందఱు నిష్క్రమింతురు.)

3 రంగము:—అరణ్యము.

(రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రవేశింతురు.)

రా—మునిచంద్రమా! తమరనుగ్రహించి మాకుపదేశించిన యీ మంత్రోచ్చారణము మాకేమిఫలమొసంగును? ఎప్పుడేయే పొద్దులఁ బునశ్చరణము సేయుచుండవలయు?

వి—రామా! నిరంతరమును మనశ్శుద్ధికలిగి నీమముతో నెవఁడు పఠించుచుండునో యట్టివానికి నిమ్మహామంత్రరాజప్రభావంబున సురలకుం బోలెనన్న పానీయంబులనవసరంబుగానుండును. తప్పక సంధ్యాకాలముల సంస్మరించుచుండవలయును.

ల—దేవా! యీమంత్రనామం బెయ్యది?

వి—లక్ష్మణా! మీకెఱింగించిన యీమంత్రము "బల" యనుపేరఁ బెన్నుపహించుచుండును. మఱియు నింకొకటికూడఁ గలదు. దానినిగూడఁ బఠింపుఁడు (ఇరువురికిఁ జెవిలోఁ జెప్పి) బిడ్డలారా!

చం. అతిబలయంచుఁ బేరిడి మ హాత్ము లమేయపుభక్తియుక్తినీ
యతులితమంత్రరాజము స హర్నిశలంబఠియింతు రిందునన్
వితరణశీలుఁబంక్తిరథు వీరనృపాల కుమారులార! సం
తతమున నంతశక్తియుత దర్పితులౌదురు నిక్కవంబుగన్.

రా—మహాభాగ్యము (నమస్కరించును)

ల—సంయమీంద్రా! భవదాశ్రమమిం కెంతదవ్వున నున్నది?

వి—లక్ష్మణా! ఇంక నొకయోజన పరిమితికలదు.

ల—(11) అన్నయ్యా! ఈకాంతారము భీకరమృగ వల్మీక శిలోచ్చ

యసంయుతంబుగాక మన శృంగారపుందోటవలె సొంపుగు నగుచున్నది. చూడుము. ఇందలి కలరవంబుల కలకలంబులును గీరంబుల కేకిరింతలును, బరభృతంబుల గానంబులును, బంభరంబుల ఝుంకారంబులును, నీలకంఠంబుల నిక్వణనంబులును వినవిన నెట్టివారికిని హృదయరంజకమగుంగదా!

రా—ఔను! తమ్ముఁడా! ఈయాశ్రమంబును దర్శింపుము.

చం. బటువుగఁ గ్రిందినుండి పయి భాగముదాఁకస్ఫురల్లతాళులన్
స్ఫుటమగు పుష్పగుచ్ఛములఁ బూర్ణతనొందుచు నల్లిబిల్లిగా
నటునిటులం బెనంగియు నహస్కరరశ్మల మాటుచేసె నే
చిటవసియింతురోగద! బకేలేయిటులుండిన హాయిఁగొల్పెడిన్.

వి—రామా! ఇది భరద్వాజాశ్రమము.

ల—అగ్రజా! మనకీ పుణ్యాశ్రమ సందర్శనంబు సకలదురితహారంబుగదా!

రా—తమ్ముఁడా! అట్లు వేఱ చెప్పవలయునా? మనశరీరాగారంబులు కూడఁ బవిత్రతనొందినవి.

ల—నిబిడ కృపహరిణంబుగారవించు నీకంఠీరవంబును నిలకింపుము.

రా—సోదరా! కంఠీరవంబెక్కడ?

ల—(వ్రేలితోఁజూపుచు) అల్లదో! కాసారతీరంబున.

రా—ఆహా! ఏమీ యబ్బురము!

ఉ. పుట్టుకతోనె కోపమును బూనిచరించెడు జాతివైరమా
పట్టివధించి మెక్కుటయె పాపముఁ బుణ్యమెఱుంగ దింతయే
నట్టిమృగేంద్రమేడ హరిణార్భకమెక్కడ స్నేహమేడ! హా
యిట్టిమహాద్భుతంబెచట నేనియుఁగాంచితిమే వసుంధరన్.

లక్ష్మణా! ఈమృగమృగాధిపులకా యెడతెగని పగలెట్లు తెగటారె? నిదియంతయు నాశ్చర్యముగా నున్నదే?

ల—అన్నయ్యా! దీనికే యాశ్చర్యంబు నొందుచుంటిని; కాని యా పన్నగపన్నగారుల సరసవినోదంబుల నీక్షింపుము.

రా—ఆహా! ఏమి! యీయాశ్రమ ప్రభావము! సమస్తజీవకోటులు నిందు జాతివైరమైనను లేక విలసిల్లుచున్నవి కదా!

ల—అగ్రజా! ఈగరుడోరగ సరసంబులనరయ నామనంబునందొక చిన్ని యూహజనించినది.

రా—ఏమియూహ?

ల—శ్రీమహావిష్ణువునకు

చం పతగమెవాహనంబు, ఘన పన్నగమే మృదుశయ్య, యట్టిచో బతగబిలేశయంబులకు బాయనివైరముఁ దీర్పఁడయ్యె శ్రీ పతియని లోకులాడు నడిఁ బాపుకొనంగమురారి ప్రేమ స్నే హితమతినుండుఁడంచు వచి యింపనిటయ్యెనటంచుఁ దోఁచెడిన్.

రా—తమ్ముఁడా! నాకునట్లే తోఁచుచున్నది.

వి—బాలకులారా! మనయెదుటనున్న ప్రదేశమొక దైత్యకామినీ పరిపాలితము.

ల—ఏమీ! దైత్యకామినియా? దానిపేరేమి?

వి—తాటక.

రా—స్వామీ! దానివలన నేరికైనను హానికలుగుచున్నదా?

వి—కలుగకేమి? అదియేప్రొద్దును నీప్రాంతమందు సంచారము చేయుచు నీమార్గంబున వచ్చుచుఁ బోవుచుండెడి జనంబులఁ దనయాకఁటిచిచ్చున కింధనములుగా నుపయోగించుకొను చుండును.

రా—ఏమీ! అంతటి ఘాతినియా?

వి—ఔను! నాయనా! ఆపెనురక్కసిని నీకరవాలంబున ముక్కలు ముక్కలుగా ఖండించి యీయున్నతారణ్యంబున నిశాచర

సంచారము నిర్మూలముగావింతువనియే నిన్నిదెసకుఁ దోడ్కొని వచ్చితిని.

రా—తాతా! భవత్కరుణా కటాక్షవీక్షణము మాయందొకింత ప్రసరింపఁజేసిన నీరాక్షసకామినిని వధించుటయెంత?

వి—రామా! అదివచ్చెడి వేళ యగుచున్నది. మీరు బహుజాగ్రత్తతో ధనువుల శరంబులు సంధించి యేమఱక నడుచుచుండవలయునుజుమా! అట్లు జాగ్రతనొందనిచో నామహారాక్షసి మనలను చుదముట్టింపక పోదు. అది మహాక్రూరరాక్షసి. ఇఁక మీరెట్లు సంచరింతురో!

రా—తాతగారూ! తమరు సెలవిచ్చినట్లే ప్రవర్తింతుము. (రామలక్ష్మణులు సన్నద్ధులై నడుచుచుందురు.)

వి—కుమారులారా! త్వరపడి పోదమురండు.

రా-ల—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు.)

4 రంగము:—అరణ్యము.

(తాటక ప్రవేశించును.)

తా—(స్వ) ఆహా! ప్రతిదినంబును ననేక ప్రాణులమారణంబు సేసి తదస్తిపిశితంబులఁ బూర్తిగాఁ బొట్టనింపుకొని మహదానందంబునఁ బ్రొద్దుపుచ్చుకొను నాకీనాఁడొక్క మాంసశకలమైనను లభింపకపోయెనే! నేఁడునాకుఁ బెట్టనిదినములు వచ్చినవి కాఁబోలును. ఆ! ఏమీ! అవలీలగా నెట్టి బలాఢ్యులనైనను బట్టి చీల్చి పొట్టనించుకొని దిట్టతనంబున సంచరించు నాకిట్టివిచారమేటికి? (అటునిటుఁజూచి) ఆదిక్కుననుండి యెవరోవచ్చుచున్నట్లున్నారు. సరిసరి! రానిమ్ము. అందఱినొక్కసారి డొ

 

క్కలోఁ బడవైచి క్షుద్బాధను బాపుకొనియెదఁగాక (ఒకవృ
క్షము చెంత దాఁగియుండును.)

(విశ్వామిత్రరామలక్ష్మణులు ప్రవేశింతురు.)

వి—రామా! మద్దిమ్రాఁకులతోడను, మఱ్ఱిమ్రాఁకులతోడను నల
యాకారముగాఁ దనరారి పగఁటిపూటనే యంధకారావృతంబై
చూపఱులగుండె లవియునట్లు వికారాకారంబుతోఁ గన్పట్టు
చున్నదదే తాటకానివేశము చూచితివా? (వ్రేలితోఁ జూ
పును.)

రా—చూచితిని. అయిన నేమి?

వి—అది మిక్కిలి క్రూరరాక్షసి, దానికి భయమొంది మేము సహి
తమేమూలనో తలదాఁచుకొని సంచరించుచుందుము, దాని
బారిఁబడిన మానవులలోఁ బ్రాణంబులతోఁ దప్పించుకొనిపో
యినవాఁడొక్కరుండును గానరాఁడు, ఎట్లు సంచరింతువో జా
గ్రత్తగా మెలంగవలయుఁజుమా?

రా—చిత్తము. దేవా! తమరెంతమాత్రమును భయపడవలసిన య
వకాశముండదు. ధైర్యముతో నుండుఁడు.

వి—(12) రామా! అల్లదే! భీకరారవంబుల భూనభోంతరాళంబు ల
వియఁగనులనగ్ని కణంబులు జలజలరాల కెంజడలు భూమిపై
వ్రేలాడ శరీరమంతయు శోణితముచేఁ దడుపఁబడి ప్రజ్వలితా
గ్నివలెఁ బ్రభలొలయ దంష్ట్రలఁ బ్రేవులు వ్రేలుచుండఁ బెద్ద
శరీరముతో వికారాకారంబుతో వచ్చుచున్నది చూడుము.

తా—(అభిముఖమై) (స్వ) (13) వాడుముని నేఁడెవ్వరినో వెంటఁబెట్టు
కొని వచ్చుచున్నాఁడు. వీరెవ్వరైయుందురు? చూచుటకు
ముద్దులొలుకు వదనములతో సర్వలక్షణలక్షితులై చేతుల
ధనుర్బాణంబుల ధరించి సకలాభరణభూషితులైయున్న యీ

కంనుపులనెట్లు పట్టి భక్షింతును? (విచారించి) ఆఁ! ఏమీ! ఆఁకలితోనవయుచున్న నాకీవిచారణయేటికి? (హసి) అరరే! మానవాధములారా! రంకారండు! మిమ్మెల్లరను మ్రింగినా క్షుద్బాధనుపశమింపఁ జేసికొనియెదను.

వి—రామా! ఈయవసరమం దాలస్యము సేయకుము. సత్వరమ సంహరింపుము.

రా—స్వామీ! మీరేమియు నీరాక్షసికైభయ మొందనలను. శాంతముతోనుండుండు. (లక్ష్మణునితో రహస్యముగా) లక్ష్మణా! నేను

తే. గీ. ధనువుచేఁబూని ప్రత్యర్థి జనులమీఁద
శరపరంపరలను గుప్పి సంహరింపఁ
బోవుటిది ప్రథమంబందు బోటులను వ
ధింపఁగునేమొ ముందు యోజింపుమయ్య!

తమ్ముఁడా! ఈరక్కసిముండను జక్కఁబెట్టఁదలఁచుటలో నాకు సంశయముగానున్నది. దీననేమైనఁ జేటువాటిల్లునేమో విచారింపుము. (14)

ల—అగ్రజా! నాకుఁ దే సందేహముగ నున్నది. దీనిఁజంపక విడిచిన మహర్షులకు దీక్షాభంగములును గష్టములును గలుగఁ జేయుచుండును. లేక తెగటార్చిన స్త్రీహత్య యొదవునేమో? అదియుఁగాక మొదటనే మునితలపై మహాభుజదర్పముంజూపిన మన విద్యాశక్తికిఁ గళంకమును మనకపకీర్తియుఁ బాటిల్లునేలయన!

తే. గీ. ఎంతకాలమొ విద్దెల నెల్లఁగఱచి
తొలుతఘోర్జరి లిఖియింపఁ దొడఁగినట్టు
లిన్నినాళ్లు ధనుర్వేద మెల్ల నేర్చి
యబలయనువులఁదీయ న్యాయంబెతలఁప.

అడయును గాక భాస్కరాన్వయ తేజోవిభాసితులగు మన పూర్వులీ విధమున నెక్కడను సలిపినట్లు తెలియదు.

తా—(స్వ) ఏకేదియో చెప్పుకొనుచుండిరి కొంచెమాలోచించి విత ర్కించెదఁగాక (కొంచెమోరగా నిలుచును)

రా—సోదరా! నీచెప్పిన చొప్పున నిప్పుడంతిని నిష్పట్టున నిర్మూలింప కున్నచో మునులకుఁ గష్టముసు మన కపయశంబును సిద్ధించు ను. పధింతమన్న స్త్రీహత్య యలముకొనునేమో యను భ యంబును, అందుముందుగా మందయానలపై శరప్రయోగం బు సేయుట విద్యాబలిమికిఁ గళంకమును గలుగుచున్నది. ఇ ప్పట్టున నేమొనర్తును?

తే. గీ. చంపకున్నను సంయమి శాపమిడును
అరయఁజంపిన స్త్రీహత్య యగునుదీని
కేమిసేయుచన? తోఁచద య్యెనుసిటుంట
గొయ్యి వెనుక, ముందట నుయ్యి యయ్యెనకట!

వి—రామా! ఏల యూరకుంటివి?

ల—స్వామీ! స్త్రీహత్య యని కాఁబోలును!

వి—రామచంద్రా! దానికేనా?

రా—ఔను—

వి—ఎంతపిచ్చివాఁడవు? ఈ రక్కసిమూండ నుక్కడించిన దోసమగు నసియా? వహ్వ! మంచియూహ చేసితివి. ఇటు వినుము,

చం. నిరతము దుష్టబుద్ధిగల నిర్జరుఁడైనను నిష్ఠుఁడైననర్క
నరపతియైన; దల్లియయి నర్క సుతుడైనను, దండ్రియైనఁదా
నరయఁగశిక్షితుండౌ, ఋత హానియెటంగలదో యాతఁడు ధరా
భరముకశింపఁజేయుటన్న పాలురధర్మము రాజనందనా!

కావున-

తే. గీ. ఆఁడుదినుటంచు స్త్రీహత్య ♦ యంచుఁగలఁగు
నెడఁదఁగల శంకవదలియీ ♦ షడఁతిపొంక
మడఁపవిశిఖములనుబూను ♦ మయ్యయింకఁ
ధరణిసంతాపదగ్ధసా ♦ గరమృగాంక !

తా—(స్వ) నాకంతకంతకు క్షుద్బాధ యతిశయింపుచున్నది. బాలు రని జాలిపడిన నాప్రాణంబు లూడసిద్ధముగానున్నవి నేను బాగుగా నుండినప్పుడుగదా ! మంచిచెడ్డ లాలోచించుట (ప్రి) రే. రే. పాఱుఁబోతులారా ! ఎవరురామీరు. ఒక్కపంటిక్రిం దికైనను జాలనట్లున్నారే ! రంపురంపు మీకండలుచించి వం డుకొని దండికూరఁ గావించుకొందును (మీఁదికుఱుకును)

రా—(తప్పించుకొని) ఇదే నీయాఁకలిదప్పు లడఁగించెదను. త్వరపడ కుము. (లక్ష్మణునితో) తమ్ముఁడా !

చం. జనకునిశాసనంబునను ♦ సంయమివెంటను వచ్చినార మీ
యనయెది యాచరింపుఁడని ♦ యాజ్ఞనొసంగును యట్లుచేయఁగాఁ
జనునిటు మంచిచెడ్డలవి ♦ చక్షణమేటికి ? మానియుండనీ
చానఁటని దుష్టిల్లఁడంచికదు ♦ శ్రేయముగూర్తును జీవకోటికిన్.

లక్ష్మణా ! మార్గణంబుల నిటు తెమ్ము.

ల—(శరములిచ్చును)

రా—(బాణమెక్కుపెట్టి) ఓకూ్రరరాక్షసీ ! ఏల నోటికి వచ్చినట్లు దురూక్తులాడెదవు ? కాలుప్రోలి కతిథివయ్యెదవాయేమి ?

తా—ఓరీ ! కన్నులుదెఱవని నీవఁటరాననున్న యమలోకమున కంపెడి వాఁడవు ? చూడుము నాబలిమి. (పట్టుకొనఁబోవును)

రా—(తప్పించుకొని) ఓసీ ! దుర్మార్గురాలా !

మ. కరుణాలేశములేక నిన్నిదెమదు ♦ గ్రకూ్రరదుర్వారదు
ర్భరపత్రి నికరస్ఫులింగములచే ♦ మ్రగ్గింతుఁబాపీ ! నిరం

తరపాంథనిజ ఘాతసంజనితనా ♦ నాపాపపంకంబులి
ద్ధరనీకన్నులగప్పె ఠౌరవజలా ♦ ధారంబునంగూలవే ?
ఛీ! చెనఁటీ! ఇదేకాచుకొమ్ము (శరమువదలును)
తా.—హా! హా! హా! చచ్చితిఁజచ్చితి (నేలఁగూలును)

(తెరలో దేవతలు)

శ్రీరాముఁడకు శుభమగుఁగాక (దేవదుందుభులు మ్రోఁగును)

వి.—రామా! ఇంతదనుక స్త్రీహత్యయని డెందమున సందియమొం దితివి! ఇప్పుడది యంతమొందినదా? దేవేంద్రాదిదేవతలు సహితమానందించి జయజయధ్వనులతో దుందుభులు మ్రో గించుచుఁ బుష్పవర్షమెట్లు కురిపించుచున్నారో చూడుము.

రా.—తాతగారూ! ఇదియంతయుఁ దమ ప్రభావమే; కాని యొండొ ద్దియునుగాదు.

వి.—రామభద్రా!

కం. ఈరాక్షసికి జనించిన
వారే మారీచుఁడుఁ సు ♦ బాహుండువారిం
జేరి యెటులఁగెగటార్చెదొ ?
ఘోరాజియె జరుగునట్టి క్రూరాత్ములతోఁ.

రా.—స్వామీ! భవత్కృపాకటాక్షవీక్షణములు మాపైఁ బ్రసరిం చుచుండువఱకు నెట్టివానినైనను బట్టి దిట్టతనంబునఁ దుదము ట్టింపఁగలము. దీనికింత యాలోచనయేటికి ?

ల.—అయ్యా! భవదాశ్రమమఁకెంత దవ్వున్నది ?

వి.—అల్లదే! సమీపించితిమి. పొద్దును గ్రుంకవచ్చినది. త్వరితము గా నడువుఁడు. (అందఱు నిష్క్రమింతురు)

## గద్యము.

ఇది యిక్కుర్తి తిరుపతిరాయ విరచి
తోర్వీసుతోద్వాహంబునందు
ద్వితీయాంకము.





# ఉర్వీసుతోద్వాహము.

## తృతీయాంకము.

[1 రంగము—విశ్వామిత్రాశ్రమము.]

[రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రవేశింతురు.]

వి.—రామా! నేనిఁక దీక్షఁ జేకొనియెదను. సవనోపయోగ పరికరములన్నియు సంసిద్ధముగా నున్నవి. మీ రెట్లు చరించెదరో? కడుజాగరూకతతో మెలఁగవలయుఁజుమీ!

రా.—స్వామీ! అటులనే వర్తించెదము; కాని

ఉ. రక్కసులేవిధంబున ని రంతరమున్మిము బాధపెట్టనే
దిక్కుననుండి వత్తురెటు దిమ్మరుచుందురిఁ కేమిచేతురా
నిక్కముదెల్పి యింకనురు నిష్ఠనుబూనుఁడు నేలఁగూల్తుమా
ముక్కడిరాక్షసాధముల మూర్ధములెల్ల క్షణంబులోఁ బలర్.

వి.—కుమారులారా! ఆవిషయంబు నేచెప్పఁబోవుచుంటిని వినుఁడు

కం. ఉడువీథినిజను దెంతురు
గడుసుఁదనంబునను మాంస ఖండంబులుపైఁ
బడవైచెదరడలింతురు
జడియకుఁడింతైన మానసంబులనెపుడున్.

సులక్షయు ననేక చిత్రవిచిత్రములుగాఁ గయ్యంబు సేయను కింతురు ఎదిరింతురు. వివిధాస్త్రప్రయోగంబు సేతురు. వారింజూచి జడియకుఁడు. కయ్యంబునకుఁ గాలుఁద్రవ్వఁడు. నారసంబులఁగుప్పించుఁడు.

పఠించుదువు. సద్యశంబును బొందుదువు. నాయాప్తితంబు నెఱవేర్పుదువు, మీకివే కొన్ని యస్త్రంబులు సమంత్రికముగా నొసంగెద గైకొనుడు. సంగ్రామరంగమునందు స్వేచ్ఛగా విహరింపుడు. జగమునకు మేలుగూర్పుడు. ఇంద్రాది దేవలోకమునకు హవిర్భాగములయందు బాధ్యత గలుగజేయుడు.

మఱియు నిటువినుడు.

కం. తెగువదనంబున దురమున
మగటిమితోఁ బోరుసల్పి మానవులకు స
త్యగణితసద్యశమగునీ
జగమున బరమునమిగుల సౌఖ్యముగలుగుక్.

రా— } చిత్తమావిధమున నే వర్తింతుము.
ల—

వి—బాలురారా! ఇటురండు (చేరదీయును)

రా— } (దగ్గఱకుబోయి ముకుళితహస్తులై చెఱియొక వైపున
ల— } నిలుతురు)

వి—రామలక్ష్మణులారా! (ఒక్కొకటి దానినిచ్చుచు)

శా. నాగాస్త్రంబిది, వారుణాస్త్రమిదిగో, నారాయణాస్త్రంబిదే,
యోగీంద్రార్చితగారుడాస్త్రమిదె, యీ యువ్యాస్త్రమాయిద్దెయి
ద్దేగంధర్వ, మదేతమంబు, గను మీ దేసౌమ్యమీదేవతా
స్త్రాగణ్యంబునశాత్రవాలినికబా ధాక్రాంతులంజేయుడీ

(చెవిలోనేదియోచెప్పి) రాకుమారులారా! ఈపరియోగోప సంహారమంత్రములను మఱవబోకుడు.

రా— } చిత్తము.
ల—

వి—రామా! ఇంతకంటెనికేమి చెప్పవలసియుండును? మహావార్త

ము సమీపించుచున్నది. నేనిఁక గ్రతుదీక్షఁబూనెదను. మీ
రేమియు భయపడవలదు. నన్నుఁబలుకరింపవలదు.

రా—
ల— } చిత్తమావిధముననే దీక్షఁబూనుఁడు.

వి—(యజ్ఞకుండమున వేల్చుచు మౌనదీక్షఁబూనును)

(తెరపడును)

(పూర్వవిధముననే రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రవేశింతురు)

ల—అగ్రజా! మునివరుఁడు దీక్షనారంభించి యిప్పటికైదు దివసంబు
లైనది. ఇంతవరకొక్క రక్కసిముండకొడుకైనను దలసూపి
యుండ లేదు. కారణమేమైయుండును ?

రా—వారలకాయువులింక నంతరించెడు కాలమాసన్నము కాలేదు
కాఁబోలును ? కాకున్న నెప్పుడో మద్బాణంబులకుఁ బ్రాణం
బులశనంబులుగాఁ జేయకుందురా ?

(అంబరవీధిని రాక్షసులు మారీచ సుబాహులు ప్రవేశింతురు)

మా—ఓరీ! తమ్ముఁడా! ఏమీదినమున దిశల నగ్నిజ్వాలలు ప్రస
రించుచున్నవి ?

సు—ఎవఁడోముని ముచ్చుయజ్ఞము సేయుచున్నటులున్నది.

మా—అటులైన రుధిరమాంసంబుల గుప్పుదమా ?

సు—అన్నా! మారీచా! అంతకంటెఁ గావలసినదేమున్నది ?

మా—అటులైనఁ బదపద! (ఇద్దఱు విశ్వామిత్రాశ్రమముపైఁ గప్ప
ట్టుదురు).

రా—లక్ష్మణా! ఏవియో భీషణధ్వనులు వినవచ్చుచున్నవే ?

ల—అన్నయ్యా! యజ్ఞహంతకులు వారేమైయుండనోపుదురు.

రా—వారలకాయువులు పరిసమాప్తినొందినవి కాఁబోలు, రానిమ్ము.

మా—(అట్టహాసముతో) ఓరీ! యెవరు రామీరు ? మాయాజ్ఞనుల్లం
ఘించి నిర్భీతిగా హోమము వేల్వఁ జేయుచున్నారు ?

రా—మేమా ? మానవులము

మా—ఓరీ ! మానవాధములారా ! రండురండు. మీకండలు తినిపం డుగచేసి కొనియెదము.

రా—రేదురాత్మా ! ఎవడవురానీవు. ఊరకున్నకొలఁదిఁ గండకావరం బుఁగాఁ గాఱులుపేలఁ దొడఁగితివి ?

మా—ఓరీ ! మనుజాధమా ! నేనెవ్వడనైన నీకేమి ? అయినను మమ్మె ఱుంగవు కాంభోలు ! విశదపఱతు నాకర్ణింపుము.

తే. గీ. మిట్టిపడునరాధములను జుట్టఁబట్టి
కట్టికాళ్లేతులనుదెగఁ గొట్టిముట్టు
పెట్టిపొట్టలనిడుకొని గట్టిపడిన
యట్టిజెట్టులు తోలివేల్పు లనఁగవిఁరా ?

రా—(నవ్వుచు) ఓహో ! మీరు తొలివేల్పులా ? అట్టులని మీయా కారములే చెప్పుచున్నవి.

ఉ. మూరెఁడుముట్టె, లందునొక మూరెఁడుమూరెఁడు నక్త్రినాసికా ద్వారము,లందు వాఁడియగు దంష్ట్రములందును వ్రేలుపేర్వులుం గారుమొగంబులుఁ జడలుఁ గాయములెల్లను రక్తసిక్తముల్ వేఱుకొర ! చూడఁదొలి వేల్పులుకారని మిమ్మునెవ్వరుఁ

మా—ఓరీ ! మూఢా ! ఏమట్లు నోటికివచ్చినట్లుపేలెదవు ?

ల—అన్నా ! తాటకయనునది వీరికేమి కావలయునో ?

మా—ఓరీ !దుర్మదాంధా ! అబలనుజంపిన ప్రబలులమనిమీ యా కావరంబులు ? మీగుండ్లు పీఁకి గ్రద్దలకు వైచెదను జాగ్రత్త గానుండుడు.

రా—ఛీ ! నికృష్టా ! కల్లుఁ ద్రావినయెడలు తెలియక త్రుళ్ళుచుం వా వేమి ? ఇటుచూడుము (ఒకశరముదీసి)

తే. గీ. తాటకను గీటణంచిన మేటితూపు
మొక్కబోవఁగా లేదింక మూర్ఖ! మీవి
యసువులందీయఁగాఁ బోలుఁ బసచెడక యె
మెఱయుచున్నది తళతళఁ గొఱవివోలె.

మా.—ఓరీ! నీచమానవా! ఏమట్లు ప్రేలెదవు? ఇవిపిల్లగంతులను కొంటివా యేమి? మారీచునిముందవి సాగవు.

రా.—వాచాటా! మదీయకోదండమిదే చూచితివా?

మా.—భళీరా! అది పిట్టలఁగొట్టుకొనుటకా యేమి?

రా.—ఛీ! రాక్షసాధమా!

శా. ఏరా క్రూర! ప్రమత్తవర్తనుఁడ! దోర్హీ మూఁడులోకంబులన్
సూరాసురారి గణమ్ము మించఁగలవా రున్నారె? లేరంచు నీ
వీరాలాపము లేలపల్కెదవు? దోర్వీర్యంబునన్ సిన్నిదో
పారావారమునందు వైతుఁ బటుమద్బాణోగ్రధారాహతిన్.

మా.—ఓరీ! మానవాధమా!

శా. బాలుండంచును నూరకున్నకొలఁదిన్ భాషించెదా పెక్కునా
పాలంబడ్డనరాధముండెవఁడు తాఁ బ్రాణంబుతోఁబోవు నీ
వాలోచింపుము మూఢచిత్త! వడిసద్భ్యామర్దమందున్నిముం
గాలుంజూడఁగ నిప్పుడంపెదనిదో కౌక్షేయకంబర్భకా!

రా.—ఛీ! ఛీ! రాక్షసకులపాంసనా!

కం. బాలుండనె, నీసాఁటిటఁ
గాలుండనె, యెఱుఁగకిట్లు కారులు ప్రేలం
బోలునె మామోత్రిలను, ఛీ
చాలించుము నీదుదుష్టసాహిత్యంబున్.

మా.—ఛీ! మానవాధమా! చిఱుతప్రాయంబుననే నీకాయువంతరిం
చునటుల విధిలిఖించెనుగాఁబోలుఁ గాచుకొమ్ము.

(ఖడ్గముజళిపించును).

రా—ఓరోరి ! దైత్యాధమా !

తే. గీ. ఉసురులందీయనోపక యూరుకున్నఁ
గాలుకూఁతలుగూసెద వేరయిట్లు
చిట్లుసని మెల్లమెల్లఁగాఁ జెనకుచున్నఁ
దలచురోదనముం జేయు తప్పెటట్లు.

దుష్టా ! నిన్నిఁకఁ గరుణించియాలసింపరాదు. ఇదేశరము (బాణమువిడుచును.)

మా—(రామునివాయవ్యాస్త్రహతిచే నెగిరిపోవును.)

సు—(స్వ) అన్నన్నా ! ఎంతమోసమువాటిల్లెను ? ఏరణంబుననైనను ధీరత్వంబునఁ బోరాడి మహావీరాధివీరుండని పేరొందిన మాయన్న నేఁడీ తీరున నోరమోముపెట్టిపాఱఁజూపుచున్నాఁడే! కారణమేమైయుండును ? వీరల భుజాటోపమునకు జంకియా? శరలాఘవంబునకు నిలువనోపకయా ? పోనీనాకేల యీవిచక్షణము ? ముల్లోకవీరుఁడని యెల్లరాక్షసశ్రేష్ఠులచేఁ బొగడఁబడిన నా శూరనామధేయమునుమాత్రము సార్థకపఱచుకొనియెదను. వీరి బాహుబలమెంతయో శోధించెదఁబట్టి బాధించెద. ఖండఖండములుగా ఖండించెదఁ బలలంబెల్ల భక్షించెద. రుధిరముచే దాహశాంతిఁ జేసికొనియెద. మత్కులంబున కెల్ల వన్నె తెచ్చెద. (ప్ర) ఓరోరి ! మర్త్యాధమా ! ఎందుఁబోయెదవు ? నిలునిలువుము. నీప్రాణంబుల నాబాణంబులకాహుతిఁ జేసెద.

ల—అన్నా ! వీఁడెవ్వఁడు ?

రా—ఇతఁడా మారీచుని తమ్ముఁడని తలంచెద.

ల—అగ్రజా ! ఈదుష్టచేతస్కునిమచ్ఛిఖిశిఖాహుతునిఁగా నొనరింతునా ?

రా—లక్ష్మణా! తాళుమత్తఁడేదో యనుచున్నటులున్నది!

సు—ఓరీ! నీచమానవులారా! ఏమట్లు వాగాడంబరము సలిపెదరు? నన్నుఁజూచియా? చూడకయా?

ల—శుంఠా! నీవెవ్వఁడవు?

సు—దుష్టా! నన్నెఱుంగవు కాఁబోలుఁ జెప్పెద నాకర్ణింపుము.

తే. గీ. ఖచర రాక్షస గంధర్వ ◊ గరుడయక్ష
సాధ్యవిద్యాధరాదిని ◊ ర్జరులుగొల్వ
వైరిమర్త్యౌఘమేఘస ◊ మీరుఁడనఁగ
వెలయువాఁడసుబాహుండఁ ◊ దెలియుమోరి!

ల—అట్లైన నీపని పట్టవలసినదే.

సు—నన్నురామీరు జయించునది? (మీసము సవరించును)

రా—ఎఱుఁగుదువా మీయన్న:—(అర్ధోక్తిలో)

సు—ఆఁ! ఏమీ.

తే. గీ. మద్యమెక్కుడుగాఁగ్రోలి ◊ మత్తుఁజెంది
యనికివచ్చుటచేత మా ◊ యన్నమిమ్ము
పీడిపోయెనేకానిమీ ◊ కోడికాదు
రండుపౌరుషమున్నదు ◊ రమ్మొనర్ప.

ల—ఔను! మీయన్న మహాబలశాలి. నీవంతకన్న మహాబలశాలివి. మీయన్న కల్లుఁద్రావి కైపెక్కి నొచ్చెను; నీవు మజ్జామాంసములు తిని పొగరెక్కి చచ్చెదవు.

సు—ఆఁ! ఏమిరా! మీప్రలాపములు? చూడుఁడు మిమ్మిప్పుడేమి చేసెదనో?

రా—లక్ష్మణా! ఈ దుండగీనితో మనకుఁ బలుభాషణంబులేల? శరమిట్టులఁదెమ్ము. (అల్లెత్రాటిని మ్రోగించును)

ల—(అంబులపొదినందిచ్చును) (19)

రా—(బాణమునువింట సంధించి) ఓరీ తులువా!

చం. తివురక యూరకున్న కొలఁ ది ర్దీ వెసఁ బెక్కులుకూసెదౌర! యా
యువు పరిపూర్ణమై తగున యోమయరోగవిధానమూఢ! నీ
జవలవసత్వముల్ గెడప శస్త్రమి దేచనుదెంచుచుండెనిం
దవిలివధించు సందియము దానవయించుక యైన లేదిఁక౯. 20

[శరమును విడువఁగా సుబాహుఁడు నేలఁగూలును]

సు—హా! హా! చచ్చితిఁ జచ్చితిని (మరణించును)

[దేవతలు పుష్పవర్షముఁ గురిపింతురు—దేవేంద్రుడు ప్రవేశించును]

దే—

కం. మునినాయకు క్రతురక్షణ!
దిననాయకవంశభరణ దీపితచరణా;
జనకాజ్ఞాపరిధారణ
ఘనతాటకజీవహరణ కదనప్రవణా!

రామా! రఘుకులార్ణవసోమా!

శా. నీపుణ్యంబున యజ్ఞభాగములు త్రో ణింబొందఁగాఁగంటిమా
పాపాత్ముల్ రజనీచరావళులచేఁ బ్రాప్తింపఁబోనున్న సం
తాపంబుల్తొలఁగెం దురంతమడఁగె౯ ధర్మంబె శేషించె వ
మ్మైపోయె౯ దితిసంతతిచ్ఛయిఁక సౌఖ్యంబబ్బె దేవాళికి౯.

ఓ నరావతార! శ్రీమన్నారాయణాంశ సంభూతా! నీలీల లత్యద్భుతములు. నపరిమేయములు, ననంతములు నట్టి నిన్ను నిరంతరంబును భక్తిశ్రద్ధలతో మానసంబునఁ దలంచువానికి నీసేవఁ జేయువానికి, నీకథ లాలించువానికి నీయందాసక్తిగల ప్రతిజీవికిని శ్రేష్ఠంబై యనన్యసామాన్యంబై, యత్యద్భుతంబై యతిసౌఖ్యదంబై యానందంబై యొప్పు భవన్నివాస యోగ్యమగు పరమపదము వైకుంఠమరచేతిలోని

దైయుండును. వేయేల ? నీచేఁగూల్పఁబడిన మహాపాతకియైనను సద్గ తియచ్చుస్థితింబొందఁగలఁడు మఱియు నీకలభ్యమెద్దియును లేదు. నీత లఁపునకు భిన్నంబు జరుగనేరదు, నీధనుర్బాణంబులసాధ్యంబులు. ముప్పదిమూఁడు కోట్ల దేవతలకు నాయకుండనైన నేను బ్రతిదినంబు ను బ్రాణముల నరచేతులందిడుకొని యేమూలనో తలఁ దాఁచుకొను చు, నారాయణా ! గోవిందా ! యని విలపించుచుఁ బెనువంతలపాల గుచుంటిని. ఇప్పుడా ముప్పలన్నియు నంతమొందినవి. మాకుఁబెట్టి న దినములు వచ్చినవి. మాకోరికలును మాతపంబులును ఫలించినవి. పాపమే నశించినది. ధర్మమే నిలిచినది ! నిలువనున్నది !

వి—(దీర్ఘాంతమునఁ గన్నులుదెఱచి) సత్యము ! సత్యము ! సత్యము!

రా—దేవా ! ఈపాటి కార్యంబునకై నన్నింతఁగాఁ బెద్దఁజేయనర్హుఁ డనా ? కాదు ! కాదు ! ఇది యంతయు మీపుణ్యఫలమే. (నమస్కరించును)

దే—జగద్భద్రసంధాయకా ! ఇక నే నరిగెద సెలవొసంగుము.

రా—చిత్తము.

దే—(నిష్క్రమించును)

వి—శౌర్యసముద్రా ! రామభద్రా !

చం॥ జనకునిశాసనంబుశిర సావహించియరణ్యభూములం
దునువసియించి రక్కసుల తోఁగలహించి వధించిసద్యశం
బునుధరఁగాంచి మత్సవన ముంగడతేర్చిశుభంబుఁగూర్చిపా
యనిదయఁజూపితౌర వర దా! కమలాలయపాణివల్లభా !

పితృవాక్య పరిపాలనాధురీణా ! జగద్భారనివారణా ! నీవలన నేనెంత యు ధన్యుఁడనైతివి. నాజన్మంబును దపంబును సఫలత నొందినవి. నాకష్టంబులు గట్టెక్కినవి. నాకేరివలనను భయంబులేదు.

రా—తాపసచంద్రమా ! మానవమాత్రుండనగు నన్ను స్తోత్రవా

క్యములతో నింత పెద్దగా గణించుట యేటికి ? నేనెంత ! నాశౌ
ర్యమెంత ? మీతపోబలంబున కెందును మాభుజబలముసాటి
యగునా ? మీరలుకఁబూనిన లోకంబులెల్ల భస్మీకరింపరా ?
మీరనుగ్రహించిన లోకంబులు శోభావంతములుగావా ?

మ. భవదాశీర్వచనప్రభావముననే - భవ్యాత్మ! కోదండినై
పవలుంగాంచినమూలలందడఁగుగూ - బల్ రీతిఁబోల్పారునా
సవనధ్వంసకులన్వధించితిని మ - చ్ఛౌర్యంబుదీపింపను
త్సవమొప్పన్ విహరించినాఁడఁద్రుటిలో - సత్యంబుమానీశ్వరా !

ఓమహనీయమూర్తీ ! భవత్కరుణారసంబింత మాపైఁ జిల్కకున్న దు
ర్వార గర్వాటోపబాహాబలులగు రాత్రించరుల బింకమడఁచునట్టి
సామర్థ్యము మాకడనుండునా? మద్వంశసంభూతుండవగు నీవుమామే
లుఁగోరిమత్సామర్థ్యంబును వెల్లడింప నీ రాక్షసులిట్లు మాచేవధింపఁ
బడునట్లు కల్పించితివి; కానికాకున్న నెప్పుడో భవత్కోపానలంబున
కు శలభాయమానులుగాకుందురా?

మ. భవదాత్మం గృపఁబూనినన్ జగముస - ర్వంబున్విరాజిల్లుమా
నివరా! లేదఘనంబు గప్పినటులన్ - నిద్రించుఁగాదేనినీ
రవివంశంబునకుం బురోహితుఁడుసు - త్రామాది దిక్పాలసం
స్తవనీయుండగు నావశిష్ఠుశతపు - త్రిశ్రేణి మ్రగ్గింపవే ?

వి.—రామా ! భవత్సందర్శనమునకై భరద్వాజాగస్త్యాది ఋషివరులు
విచ్చేయుచుండిరి చూఁడుము .

(పూర్వోక్తమానులు ప్రవేశింతురు)

భ—సీ. మదినినీహారక్ష - మాభృత్కుమారియ
శ్రాంతంబుఁ గొల్చున - నంతుఁడితఁడౌ
అ—సనక సనందాది - సంయముల్ నిరతంబు
ముక్తికై సేవించు - మూర్తియితఁడౌ

భ—నారదుండెప్పుడుం ॥ నారాయణముసేయు
నామంబుగలపరం ॥ ధాముఁడితఁడె

అ—వసుమతీభారంబు ॥ వారింప దశరథ
భూపాలునకుఁబుట్టు ॥ పుణ్యుఁడితఁడె

భ—తే. గీ. బలినధోలోకమున నుండ ॥ బంచినట్టి
అ— వామనుఁడితండెమత్స్యమై ॥ వరలెనితఁడె
భ— వసుంధరనగంబు మోసిన ॥ మగఁడితండె
అ— తలఁప నరసింహమూర్తియై ॥ తనరెనితఁడె.

భ—ఓమహనీయమూర్తీ! రామమూర్తీ! యుష్మత్కరుణా కటాక్ష వీక్షణములచే మేమెంతయుఁ బావనులమైతిమి. దుర్వర్తనుల గు నక్తంచరులవలని భయంబు లడంగినవి. మాకింక శ్రేయముం గూర్పఁదలంపుము.

రా—మానివర్యులారా! మీకివే వందనములు (నమస్కరించును)

భ—
అ— } శీఘ్రమేవ కల్యాణసిద్ధిరస్తు. ఇంక మేమరిగెదము.

రా—చిత్తము.

(భరద్వాజాగస్త్యులు నిష్క్రమింతురు.)

వి—కుమారులారా! మిథిలాధిపతియగు జనకమహారాజునింట నొక కార్ముకంబు గలదఁట. దాని నెక్కుపెట్టిన వారికిఁదన కూఁతు సీతనిచ్చి యుద్వాహముసేయునఁట యచ్చటికేగి తత్స్వయంవరము సందర్శించి పిమ్మట నయోధ్య కేగుదము. ఇందు మీ యభిప్రాయమేమి?

రా—చిత్తమూలాగుననే వెళ్లుదము.

వి—అటులైన రేపు రేపకడ వెళ్లుదము. ఉటజములోనికి రండు.

(మువ్వురును నిష్క్రమింతురు)

## 2. రంగము—అరణ్యమార్గము.

(రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రవేశింతురు)

వి—సుమారులారా! మీరెన్నఁడు నిట్టి కఠినమార్గంబుల నడిచియు, నీకందమూలంబులఁ గుడిచియు నిట్టి కష్టంబు లనుభవించియు నుండరుగదా!

రా—దేవా! తమచెంత మేమున్నంతకాలమెట్టి యిడుమ లనుభవింపు చున్నను మాకవి కష్టంబులుగా నుండ వేలయన!

ఉ. ఆరయ వీడుగాని విపినాంతర భూము లెట్టివైనఁగాని యిం
కేరహికిన్న గోచరమహీధ్రమహాగుహాపాళిగాని చే
కూరునె తండ్రి చెంగటనె కూర్మిఁజరించెడు బిడ్డకెందునం
గోరము మమ్ములన్నరయఁ గోరియిటాడెదుగాని సద్గురూ!

స్వామీ! మహారణ్యంబులందైనను భయంకరాద్రి గహ్వరంబులందైనను నింకెట్టి క్రూరనక్తంచర సంచార ప్రదేశములందైనను మీరు వెంటనున్నఁ దల్లిపొదిగిటనుండు పిల్లలరీతి నిర్భయముగాఁ జరింతుము.

ల—అగ్రజా! మునివరునకు మనపైఁగల ప్రేమాతిశయంబున నిట్లు పలికెనేకాని యిచ్చోటులయందు సంచరించుట కష్టముకాదు. వినుము.

ఉ. ఈవిటపిన్నివాస మొనరించెడు భాగ్యము దీక్షసేయఁగా
నేవిధిఁగల్ల నేర్చును జనించినదాదిగ దుష్కృతంబులం
దేవశమాట మన్మతులు ధీరమనీషులు దేవభక్తినెం
తేనిమలాత్ములై తగుము నీశ్వర కోటికిఁబోలుఁగాకిలన్.

జననంబాది సంతతదురంత దుష్కృత సంభరిత స్వాంతులమగు మాబోంట్లకీ యపవర్గదాయకంబగు విపినంబున నివసించునంతటి భాగ్యము కలుగునా?

వి—(స్వ) ఏమీ కుమారుల వినయవాక్యములు గాఢపరిజ్ఞాన గర్భిత
ములై వినవినఁ గర్ణరసాయనములుగా నున్నవి!

ల—అన్నయ్యా! ఇది వసంతముగదా!

రా—తమ్ముఁడా! ఔను. గనుకనే.

మ. వరుసంబండిన యాకులెల్ల నిలపై వాతాహతిం రాలె భా
సురమై కాననమెల్లఁబల్లవితమై సూర్యాంశులం దీరతం
జొరనీకేమృదుపత్రి కుట్మలపరిస్ఫూర్తిన్విడంబించున
ద్దిర యీ యందముఁజందముం దెలుపసుం తేనిన్వశంబౌనొకో.

ల—ఆహా! ఏమి! యీ వనరామణీయకము! మానీశ్వరా!

మ. నలుతట్టుల్ ఘనసారభూజములు విన్యాణంబుగాఁ గ్రాలఁగా
మ్మలనైనంగననీక యల్లెకొనెఁజుమ్మా ముప్పిరిం వేణు ల
ట్టులమల్లెల్ భళిరాభళీ! యిటమహాఘ్యుం డెవ్వఁడో యుండిన
ట్టులఁజూపట్టును దెల్పుమా మదిని నాకౌటోపంబు శాంతింపఁగన్.

మఱియును

తే. గీ. నిరుపమానశోభితపుష్ప నిచయకలిత
మై వరలు నిద్దిసద్వనం బయ్యో దీన
నెవరువసియింతురోమఱి యేలయిచోటఁ
బాసిపోయితో? తెల్పుమా భవ్యచరిత!

వి—కుమారా! ఇయ్యది గౌతమాశ్రిమము.

రా—ఇప్పుడామునివ యేమయ్యెను?

వి—హిమాద్రినిఁ దపంబుఁ జేయుచున్నాఁడు.

ల—అహల్యానాథుఁడందురే ఆమె యెక్కడ?

వి—అల్లదే మార్గమధ్యంబున గ్రావమైయున్నది. చూడుఁడు.

రా—దేవా! ఆతల్లి యిట్టులగుటకేమి కారణము? ఆయాశ్రిమమిట్లు
బావురుమను టేటికి?

21

వి—రామా! ఈమె

ఉ. ఇందురినితోడఁ జెల్మి యొనరింపఁగఁ దద్విషయంబుఁ గాంచిమా
నీందురుఁడు మండియిట్లు శపియింపశిలాకృతి నుండెనో కృపా
సాంద్ర! భవత్పదాంబుజరజంబునలోకములెల్ల మెచ్చని
చంద్రముఖి న్విముక్తిఁగనఁ జల్పుము శాపముఁ బాపిప్రేమఁ ...

రా—ఆఁ! ఏమీ?

ఉ. ముప్పదిమూఁడుకోట్లసుర ముఖ్యులకుంబ్రభువై చెలంగి యా
తప్పొనరించె నన్ననిక ధారుణి మానవులెంతవారిసీ!
యిప్పసి కూడదన్నజను లేమివచింతురు? దేవనాథుఁడే
గొత్పఁదనంబు వీడియిటు కూరతజారుఁడుగా మెలంగినన్.

పోనిండు మనకావిమర్శన మేటికి? (బాఁడను గాలఁదన్నును)

(అహల్య ప్రవేశించును)

అ—(కరములు ముకుళించి)

దండకము.

శ్రీమించు సూర్యాన్వయంబందు క్షీరాబ్ధినిన్ శార్వరీనాడుపో
ల్కిన్ జగం బెల్లహర్షింప మర్త్యుండవై పుట్టి శ్రీరామనామంబునం గ్రా
లు నారాయణా! కేశవా! మాధవా! పుండరీకాక్షు! గోవింద! నా
నేరముల్సైచి నన్నుంగృపంజూచి నాతోంటిరూపంబు గల్గంగటాక్షించి
తౌ నార్తరక్షామణీ! భక్తచింతామణీ! నిన్నుఁగీర్తింపనే నెంత దా
నన్ సురేశాది దిక్పాలు రేయెన్న లేరైరి మోశార్గచక్రాది దివ్యా
యుధా! సర్వభద్రప్రదా! కూరకర్మల్ సురాచారులుం దుచ్ఛు
లునైనన నక్తంచరస్తోమమత్తేభ హర్యక్ష యక్షీణతూణీర! పక్షీం
ద్రవాహా! జగద్రక్షభావా! యనిర్లక్ష్యకోదండ! ప్రత్యక్షదేవా!
నమస్తే! నమస్తేనమః॥

రా—అమ్మా! నీపున్నెమే నన్నిటకుఁ దోడి తెచ్చి నిన్ను రక్షించినది; కాని నాశక్తి యెంతమాత్రమునుగాదు.

అ—తండ్రీ! పుట్టినదాదిగా నీపాపమెఱుంగక పతివ్రతాశిరోమణి యని పేరొందిన నేను దుట్టతుదకెట్టి కట్టడిఁ గొడఁగట్టవలసి వచ్చెను!

కం. మనమున, వాక్కునఁ, గర్మం
బున, బతిపూజావిధాన మునవర్తిలి కీ
ర్తినిఁ గన్న నాకులోకం
బునఁ దలవంపులు ఘటిల్లెఁ బురుహూతుని చేన్.

(దుఃఖించును)

వి—అహల్యా! అనుభవించిన యవస్థ కింతైనను జింతింపఁ జనదు. [గూడియా చూడుము.

మ. తొలిజన్మంబున సల్పు సత్కృతములున్ దుష్కృత్యముల్
వలిజన్మంబున సౌఖ్యకష్టములుగాఁ బాటిల్లునద్దానికై
విలపింపం బనిలేదు బ్రహ్మనయినన్ వేధించుఁ బాట్లున్న చో
లలినీమానవులెంత కర్మఫలము ల్లంఘించి వర్తింపఁగన్.

అ—మునికుంజరా! నమస్కారములు (నమస్కరించును)

వి—శీఘ్రమేవ యుష్మద్వల్లభసంయోగసిద్ధిరస్తు.

అ—అయ్యా! నాపతి యెందున్నవాఁడు?

వి—అహల్యా!

మ. అపవర్గంబునకై నిరంతరము నీ హారక్షమాభృత్తునం
దపమున్ సల్పుచునుండె నీమగఁడు మే ధావంతుఁడాతండు స
త్కృపనీపైఁగల కూర్మి రాముని కటం గీర్తించుచున్ వచ్చుచు
న్నపవిత్రాత్మునదే కనుంగొనుము సం తా! భీతియింకేటికిన్.

అ—(పరికించి) (స్వ) ఏమినాభాగ్యము!

రా—మునీంద్రా! ఆవచ్చునది గౌతమమహర్షి యేనా?

వి—ఔను. జరిగిన సంగతినంతయు దివ్యజ్ఞానంబునఁదన యంతరాత్మను గ్రహించి యమందానందంబున నీయెడ కిదేనిన్ను ధ్యానించుచు వచ్చుచున్నాఁడు.

(గౌతముఁడు ప్రవేశించును)

గౌ—శ్లో॥ హరేరామ హరేరామ। రామరామ హరేహరే.

అ—(పాదములపైఁబడి) ప్రాణేశ్వరా! ఈ దీనురాలియెడఁ గలుగు తప్పులన్నింటిని మన్నించి యుద్ధరింపుఁడు.

గౌ—(లేవనెత్తి) ప్రాణేశ్వరీ!

ఉ. రాముని సత్త్వముం దెలిసి రాక్షసులెల్లరు దుష్టకాయ సం
స్తోమములంత్యజించి కడు శుద్ధమనోంబుజులై చరింతురం
చీమహినిన్నువీడి వడి నేగితినీపయిఁ గూర్మిలేక కా
దో మహిళాలలామ యిఁక నుండియుఁ బ్రేమిడి గారవింపవే.

రా—మునికులతిలకా! వందనములు (నమస్కరించును)

గౌ—శీఘ్రమేవకల్యాణసిద్ధిరస్తు.

రా—మహాభాగ్యము. 22

గౌ—రామా! యుష్మత్కరుణా కటాక్షవీక్షణంబున మరల నాభార్యతోఁ గలసియుండు భాగ్యము నేకూరినది. ఇంక నేనెంతయు ధన్యుండను. నావలెనే నీవును ద్వరలో భార్యనుజేకొని సుఖించెదవుగాక! (అక్షతలిడును)

వి—కుమారులారా! ఇంక బయలుదేరుఁడు.

గౌ—రామచంద్రా! వెళ్లివత్తుము.

రా—చిత్తము. (అందఱును నిష్క్రమింతురు)

గద్యము.

ఇది యిక్కుర్తి తిరుపతిరాయ విరచి
తోర్వీసుతోద్వాహంబునం
దృతీయాంకము.





# ఉర్వీసుతోద్వాహము.

## చతుర్థాంకము.

1 రంగము:—మిథిలానగరప్రాంతము.

[రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రవేశింతురు.]

రా—మునిచంద్రమా! ఏమంటిరి?

తే. గీ. సర్వసర్వంసహాధీశ । సత్కుమార
వరులకు నసాధ్యమైన శం । కరునిధనువు
నేనొకండనె మోపెట్ట । నేర్తుననుట
తెలియభవదీయ కరుణార్ద్ర । దృష్టి కాదె?

వి—రామచంద్రా! నావాక్యమమోఘము. మిథిలకు మనమేతెంచుట భవద్వివాహార్థమేయని నమ్ముఁడు.

ల—తాతగారూ! ఇదేమండి యనవరతాత్మాను సంధానుండును, యజ్ఞదీక్షాతత్పరుండును నగు జనకమహారాజుపై నెవ్వరో దండెత్తి వచ్చినట్లున్నదే?

వి—నాయనా! లక్ష్మణా! కాదు! కాదు!

ఉ. మానితకీర్తి యాజనక । మానవనాథుఁడు భూమినంతటన్
జానకికిన్ స్వయంవరముఁ । జాటఁగఁబంపెద దర్థమైనృపుల్
పూనిదిగంతరంబులను । భోరుకొనం బహువాద్యసంతతుల్
సైనికసంఘముల్ గొలువఁ । జక్కఁగవచ్చి వసించిరిట్టులన్.

రా—వారెవ్వరో మనకభిముఖముగా వచ్చుచున్నారు.

వి—(పరికించి) ఔను! మనచే ముందుగాఁ బంపఁబడిన మునులవలన మనమేతెంచుట విని జనకమహారాజు సగౌరవముగాఁ దోడ్కొనిపోవ నేతెంచుచున్నాఁడు. మనమిచ్చట నిలుతము.

(జనకుఁడు మంత్రిపురోహితాదులతోఁ బ్రవేశించును.)

జ—విశ్వామిత్రమహర్షీ! నమస్కారము. 23.

వి—సమస్త సన్మంగళానిభవంతు. జనకక్షితీశా! 24.

తే. గీ. రామలక్ష్మణులన్నన కేర్భకులటంచుఁ
దలఁపఁబోకుము పురుష సత్తములు, వీరి
విషయమును బూర్తిగా నెన్నఁ గవిఁ దరమె?
పెంపుదీపింపఁగా గారవింపుమయ్య!

జ—తమయనుగ్రహమ్మున శక్తివంచన లేక యట్టులేయొనర్తురు. లోపంబున్న నాయజ్ఞానమును క్షమింపుఁడు. (రామలక్ష్మణులతో) రామచంద్రా! సౌమిత్రీ! మీనాయనగారు మున్నగువారి కెల్లరకుఁ గుశలమేకదా!

రా—చిత్తము. సేమంబున నున్నవారు.

జ—అవే! భద్రగజంబు లధిరోహణము సేయ విచ్చేయుఁడు.

వి—మంచిది. దాశరథులారా! పోదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

2 రంగము:—స్వయంవర మంటపము.

(జనకుఁడు, పురోహితుఁడగు శతానందుఁడు, రాముఁడు, లక్ష్మణుఁడు, విశ్వామిత్రుఁడు, చెలికత్తెలతో సీత, నిఖి
[లరాజకుమారులు, ప్రవేశింతురు.]

జ-చం. నరవరపుత్రులార! బుధనందితశౌర్య బలాఢ్యులార! యీ హరధను వెత్తి యెక్కిడిన యట్టి మహాత్ముని నాతనూజ సత్వరమ పరిగ్రహించునిది పన్నిదమోపినవారు నాసుతం గరమనురక్తిఁ జేకొనఁగ గల్గినవారును బూనుఁడీ వెసన్.

రాజుల కెల్లరకు యథాయోగ్యమగు నీస్వయంవరంబున మజ్జా మాత యెవ్వరో తెలియఁగోరెదను.

కుంతలదేశపురాజు—(స్వ) అరరే! ఏమి! ఈకోమలాంగి సోయగము! ఈమె వరించినవాఁడేకదా పురుషోత్తముఁడు! తామసించినచో నెవ్వఁడు మోపెట్టునో (వింటిని సమీపించి దానినిగదలింపఁజాలక శ్రీమత్రోఁజుచు ప్రకాశముగా) రాజకుమారులారా!

ఉ. ఎక్కఁడివిల్లు దీనినరుఁ డెవ్వఁడు వంపగలాఁడు మున్ను నే
నెక్కటికయ్యమందు యశ మెంతయొ కాంచితి వీసమంతయున్
బ్రిక్కఁకుఁ ద్రోయనైతి నిఁక బాహుబలంబుడివోయె నక్కటా
నిక్కమమా జగద్గురుఁడు నేర్చునుగా కారులెత్తనేర్తురే?

మాళవదేశపురాజు—అయ్యో! చాలింపుఁడు.

కం. తనకు నసాధ్యంబగు కా
ర్యము నితరులొనర్పఁజాల రనఁదగునే? యే
సమయం బెట్టిదియో? యు
త్తము లెవ్వరో తెలియవశమె ధాత్రినెవరికిన్.

కావునఁ ద్వరపడఁజనదు (తన్నుఁజూపుచు) ఈమాళవేంద్రునిమాట మఱచియుందురు (వింటిని సమీపించి కదలించియు నెత్తఁజాలక స్వగతము) అందఱివలె నూరకుండక నేనేలప్రగల్భములు పలికితిని? అబ్బా! ఇదెక్కఁడివిల్లు! (యథాస్థానమునఁ జిన్నపుచ్చుకొని కూర్చుండును.)

(అట్లేరాజులెల్లరు నెత్తఁజాలక చూచుచుందురు.)

వి—నాయనా! రామచంద్రా! నీవును బ్రయత్నించి చూడుము. నీకీవిల్లేపాటిది?

మాళ—(తక్కినవారితో రహస్యముగా) ఏమిప్రయత్నమో? ఈజడదారి ముక్కుమూసికొని మంత్రములు గొణఁగుట యనుకొనె

నగాఁబోలును. రణకర్కశులగు నిందఱు రాజులకలవిగాని యీవింటిని నంపఁ బసిపాపలఁ బ్రేరేపించు చున్నాఁడు.

కుంత—అయ్యా! చాలింపుఁడు. ఇంతకుమున్ను తమరాడిననీతి తమకుఁ బనికిమాలినదయ్యెనా యేమి? ఏపుట్టలో నేపామున్నదో యెవ్వఁడెఱుఁగును?

తే. గీ. సింహపుఁగిశోరమిభములఁ జీల్పలేదె?
చిచ్చొకింతలోకము నీరు సేయలేదె?
వజ్రమఖిలాద్రులను భంగపఱుపలేదె?
వయసుతోనేమిపని? ప్రభావంతునకును.

రా—స్వామీ! విశ్వామిత్రమునిచంద్రా! నమస్కారము. తమయాజ్ఞయవిలంఘనీయముగదా! అట్లే ప్రయత్నించెదను.

(వింటికిఁ బ్రదక్షిణ నమస్కారమాచరించి.)

తే. గీ. ఎపుడుఁ బోషించుచుండు లోకేశ్వరునకు
దయనుగనిపెంచు మాతల్లిదండ్రులకును
దెలివియును బుద్ధియును నేర్పు దేశికులకు
వందనమొనర్తు మదిని సద్భక్తికముగ.

(అశ్రమంబునమోపెట్టి నారిలాగఁగా గొప్పధ్వనితో భగ్నమగును. సభాసదులు మూర్ఛనొందుదురు. సీతాదేవి పుష్పమాల రాముని మెడలో వైచి నమస్కరించును.)

జ—(రామునిఁ గౌఁగిలించుకొని) రామచంద్రా!

ఉ. పూర్వము దక్షుఁడధ్వరము పూర్వముగా నొనరింప దేవతల్
గర్వితులై మహేశ్వరునిఁ గాదన సిధను నెక్కుపెట్టి యా
శర్వుఁడు సర్వదేవతల జర్జరితాంగులఁ జేసి వేఁడినం
జర్వితకార్యమున్విడిచి సత్కృపఁ బ్రోచెను సర్వకోటులన్.

పిమ్మట నిమ్మహాధనువు మద్వంశశ్రేష్ఠుఁడగు నిమి కొఱపతరము వాఁ

డగు దేవరాతునకా శంకరుడిచ్చె నది మొదలీహరు వింటిని మద్వంశకర్తలెల్లరు భక్తిపూర్వకముగాఁ బూజింపుచుండిరి. మఱియును.

ఉ. పొందుగ జన్నముంజలుపఁ ॥ బూనిధరాస్థలి దున్నుచుండగా
మందసమొండు కన్పడియె ॥ మానుగ దానినిదీసిచూచి నం
గందువొకర్తు కన్పడియె ॥ ఝమ్మసుతసీతయటంచుఁ బ్రేమతో
డందనుజూతయంచుఁ బ్రీక ॥ టంబుగఁ బెంచితిఁ బెద్దఁజేసితిన్.

కం. ఈతరుణికిఁ దగువరుఁ బృ
థ్వీతలమునఁ గనకహారుని ॥ విల్లెక్కిడు న
త్యాతతబలుఁ డయ్యెడు నా
కూఁతునకున్ భర్తయనుచుఁ ॥ గోరితినసఘా!

అట్టినాపన్నిదంబు నెగ్గించి నా పట్టికినాథుండవైతివి.

వి—జనకచక్రవర్తీ! ఇంకనాలస్యంబేల? వైవాహికమహోత్సవంబు శీఘ్రింబ కావింపుము.

జ—చిత్తము (పురోహితునితో) శతానందమహర్షీ! శుభలగ్నము నిశ్చయింపుఁడు

శ—మంచిది=శ్లో=మాఖపాల్గుణ వైశాఖ, జ్యేష్ఠమాసాశ్శుభప్రదాః అన్నారు. కాఁబట్టి (పైవంకఁజూచి వ్రేళ్ళుముడిచి) ఈవైశాఖశు ౭ గురువారము పగలు ౧౮ ఘటికల ౨౨ విఘటికలకుఁ క ర్కాటక లగ్నమున శుభముహూర్తవు దివ్యముగా నున్నది.

జ—చిత్తము. నాదొకమనవి యున్నది.

తే. గీ. దశరథేంద్రునితోడ బాం ॥ ధవ్యమన్న
నామనంబునకెంతొ యా ॥ నందమయ్యెఁ
దోడనన నాయనుజుని కూఁ ॥ తుండ్రముపుర
దశరథుకనిష్ఠ సుతులకీఁ ॥ దలఁచినాఁడ.

వి—సర్వోత్తమముగా నున్నది. అట్లేకావింపుము.

జ—కావున నోగురూత్తమా! తమరిప్పుడు నిర్ణయించిన ముహూర్తమునందే నలుగురి వివాహములును గావింపవచ్చునా?

శ—(యోజించి) దివ్యముగాఁ జేయవచ్చును.

జ—మంత్రీ! నీవాలసింపక తన్ముహూర్తమునకు దశరథేంద్రుఁడాత్మజపరిచారాదులతోఁ దరలివచ్చునట్లు శుభలేఖలంపుము. వానియందిచ్చటి విశేషములును రామలక్ష్మణుల క్షేమాతిశయములును వ్రాయుము. (25.)

మం—చిత్తమట్టులే వ్రాసిపంపెదను.

జ—రాజోత్తములారా! తమరెల్లరు నాప్రార్థన మంగీకరించి వైవాహిక మహోత్సవంబు వీక్షింపఁగోరుచున్నాఁడను.

రాజులు—మంచిదట్లే నిలుతుము.

జ—విశ్వామిత్రమహర్షీ! యింకనీసభఁ జాలింతము.

వి—మంచిది.

(అందఱు నిష్క్రమింతురు.)

3 రంగము:—మిథిలలోని బ్రాహ్మణాగ్రహారము.

(శాయన్నశాస్త్రియు, అమరావధానియుఁ బ్రవేశింతురు.)

అ—శాయన్నశాస్త్రీ! ఎట్లెట్లు? దశరథతనయుఁడు శివధనువుమోపెట్టెనుగా? అయ్యయ్యో! ఎంతమంచి సమయమునకు లేకపోతిని.

శా—అమరావధానీ! మీరెఱుఁగనట్లు మాట్లాడుచున్నారు గ్రామమందు లేరా యేమి?

అ—అయ్యో! లేనయ్యా! శివయ్యసిద్ధాంతిగారికిఁ బిల్లనుమాట్లాడఁ బోయితిని.

శా—శివయ్యసిద్ధాంతికేమి? పెండ్లి యేమి? నీవుకుదుర్చుటయేమి? ఆశ్చర్యముగా నున్నది.

అ—ఆశ్చర్యమేమి ? మళయాళదేశములోఁ గుదిర్చినాను. పిల్లకుఁ ద్రామ్మిదవయేఁడు. చక్కనిచుక్క యథార్థము.

శా—అబ్బే ! అబద్ధమనికాదు. ఇఱువదేండ్లుదాఁటిన బహుగుణకు వివాహావేక్షయేమాయని యట్లంటిని.

అ—ఇఱువదేండ్లు వచ్చిననేమి ? నూఱేండ్లువచ్చిననేమి ? ఆయనకేమి మహారాజు వాండ్రకుఁ బ్రాప్తిలేకపోయినారు; కాని వెనుకఁటి మూఁడు పెండ్లిండ్లకు మొత్తము పదివేలు వ్యయపఱచినాఁడు.

శా—అవును. మొదటిభార్యను సరిగాఁజూడక చెఱతిరిగి అడ్డమైనరోగములు తగిలించుకొని అని తనభార్యకుఁగూడదయసేయుటచేతఁ దీసికొనియును ఓగులుపడియును మరణించినది. రెండవభార్యకుఁ గామసోమయాజులతో స్నేహమై పట్టపగలు పడమటింటిలో నిద్దఱుండఁగా భర్తచూచి కొట్టి గోలపెట్టుటచేత బావిలోఁబడి చచ్చినది. ఇఁకమూఁడవభార్య అదేమిదేవుని కాశింసాహేబును దీసికొని లేచిపోయి గాశిలోఁ గాలక్షేపము సేయుచున్నది. చేసికొనఁగానే సరియా ? కాపురముదిద్దుకొను తెలివియుండవద్దూ ? దానికేమి ! ఇచ్చువారికైన బుద్ధియుండఁగూడదా !

అ—అయ్యో ! అన్నియుఁ జూచుచునే తమరట్లుసెలవిచ్చెదరేమి ?

తే. గీ. ధనమొకటియున్నఁజాలు దు ర్మార్గుఁడైన
సంకరకులోద్భవుండైన, సర్వరోగ
పీడితుండైన, జముఁడైన, వృద్ధుఁడైన,
శవమెయైనఁ, గన్యకల నొసంగుచుందు.

శా—సరియే; కాని సిద్ధాంతిగారికిప్పుడుపిల్లనిత్తుమనిన వారికీతనిస్థితిగతులు తెలియునా ?

అ—తెలియకేమి ? తమకు రావలసిన పదునేనువందలును, బిల్లసామ్ముక్రింద నెనిమిదివందలును మొత్తమిరువదిమూఁడు వందలరూ

ప్యములముల్లె తమకుఁ జెల్లినఁ జాలును. దక్కినవానితోఁ దమ
కుఁ బనిలేదనిరి.

శా—అట్లనుటలో వారియుద్దేశ మేమో కనిపెట్టితిరా ?

అ—ధనమునం దపేక్షగలవారికితరవిషయములతోఁ బనియేమి? అయి
నను వారియుద్దేశమునాతో రహస్యముగా నిట్లు చెప్పిరి.

ఉ. కూతురుచిన్నదన్నిఁ టికి ఁ గోలయటంచుఁ గుటుంబమెల్ల జా
మాతగృహంబునం దెయను ఁ మానములేక సుఖింపవచ్చు ముం
దాతఁడు చచ్చెనేని విపు ఁ లాస్తికిఁ గర్తగనుండవచ్చు నా
కూఁతురిఁ కెట్లువస్తలినఁ ఁ గొంకకయోరువవచ్చు భూసురా!

శా—గడుసరియూహయే ; కాని మళయాళబ్రాహ్మణులపని చాలన
న్యాయముగానున్నది.

సీ. తనచిన్నికాంత సూ ఁ త్రిముఁ దీసిమాటి య
న్యులకిచ్చి పోట్లాడు ఁ చుండువారు
గులహీనకన్యలఁ ఁ గొనివచ్చి యిచ్చోటి
విప్రులకిచ్చి జీ ఁ వించువారు
నల్లుండ్రఁ గికురించి ఁ యాత్మజాతల బల్మి
యవనయావనులకు ఁ నమ్ముచువారు
వధ్వర్థమే తెంచు ఁ వారినింటికిఁ బిల్చి
హింసించిధనము గ్రి ఁ హించువారు

తే. గీ. నైనటింతురు వీరెబ్రా ఁ హ్మణులకెల్ల
దుర్యశంబునుఘటియించు ఁ దుష్టు లరయ
నితరవృత్తులు భూమిపై ఁ నెన్నిలేవు ?
సిగ్గులేదొకో ? దేహమ ఁ స్థిరముగాదొ ?

శానిండు. తమరింత పట్టుదలతోఁ బాటువడుచుంటిరి. లాభమేమి?

అ—అయ్యో! లాభములేకేమి ? ఏదైవునైననేమి మూఁడువందల

రూపాయలు రావచ్చును.

శా—ధనముకాసించి తమ బోటిపెద్దలిట్టివిషయములలోఁ బ్రవేశిం చుట న్యాయమేనండీ?

అ—ఇచ్చువారికిఁ జేసికొనివారికి బుద్ధిలేనప్పుడు నాకేటిన్యాయము? (దృష్టిసారించి) అడుగో! చలమయ్య చయనులు గారెచ్చటి నుండియో వచ్చుచున్నారు?

(చలమయ్య చయనులు ప్రవేశించును)

చ—(నిట్టూర్పుపుచ్చి) ఇస్సు! అబ్బా! ఏమండి! క్షేమమా?

శా—అదేమట్లడుగుచున్నారు? మీరీమధ్యగ్రామమందు లేరాయే మి?

చ—లేనండీ! సూర్యనారాయణరావుగారి పుత్రునకు సంబంధముఁ గుదుర్చుటకు వెళ్లినాను.

శా—సూర్యనారాయణరావుగారి కుమారునికి సంబంధమును గుదుర్చుటమేమండీ? మేనమామకూఁతురుగలదు గాదా?

చ—ఉన్నదండి! బంగారపుబొమ్మ మనకవులు వర్ణించుపద్మినీజాతియే యాచిన్నదనవచ్చును, సాంప్రదాయముమంచిది. వారికివీరికి నేఁ డు మూఁడుపురషాంతరములనుండి సంబంధమ విచ్ఛిన్నముగా సాగుచున్నది. వారియాఁడుపడుచులవల్ల నే వీరివంశమభివృద్ధియ గుచున్నది. సూర్యనారాయణరావుగారికి వచ్చునిబ్బందుల క న్నిఁటికి వారే యాదుకొనుచున్నారు.

శా—అట్టులున్నపుడు వారిసంబంధమేలమానుకొనెను?

చ—సూర్యనారాయణరావుగారు పూర్వముమంచివారే; కాని ఇప్పు డు దగ్గఱఁజేరి చెప్పువారిమాటలువిని సంగీతములకని సభలకని స్నేహితులయక్కఱలకని తండ్రియిచ్చిన ధనమంతయు వెచ్చ పెట్టుటయే కాక పదివేలరూపాయలప్పుకూడఁ జేసినాఁడు. ఈ

మధ్యం బొలమమ్మి కొంచెము తీర్చినాడంట; కాని విశేష భాగ మట్టులేయున్నది.

శా—అబ్బా! ఆగొడవ మనకేటికి? సూర్యనారాయణరావుగారు తమ కొమరునకి మేనరిక మేల చేసికొనలేదు?

చ—అదేనండి! నేను జెప్పుచున్నది. ఈమధ్య నెవ్వరోవచ్చి లోపలి గుట్టెఱుఁగక యిండ్లవాకిళుల పటాటోపము వీక్షించి రెండు వేలరూపాయలువరశుల్కమిత్తుము. మీయబ్బాయికి మాయమ్మాయిని జేసికొనుఁడనిరంట.

శా—దానికి సూర్యనారాయణరావుగారి భార్యయిష్టపడినదా?

చ—లేదు. "నా తమ్ముని కుమారితను జేసికొందుము. ఇతర సంబంధములతోఁ బనిలే"దని వారినిఁ బంపెనంట; కాని దగ్గఱనున్నవారు "ధనమువచ్చునప్పుడక్కఱలేదందురా? వరశుల్కము మీరుకోరినంతయిచ్చుచో మేనరికము సేయుఁడు లేనిచో శుల్కమిచ్చుచోటనే చేసికొనుటయుత్తమ" మనిరంట.

శా—సరి! సరి! ఆవరశుల్కము రామారావుగారీయలేమనిరి కాఁబోలును. పిమ్మట నితరసంబంధముల విచారింపమిమ్మంపియుందురు. అంతేనా?

చ—ఔను. జరిగినదంతే.

శా—ఇప్పుడెచ్చట నిశ్చయపఱచినారు?

చ—ప్రయాగలో నరసింహారావుగారి పుత్రికను గుదుర్చుకొని వచ్చుచున్నాను. వరశుల్కము రెండువేల యేనూటను, ఆఁడుబిడ్డలకు నైదువందలును, స్తన్యపానశుల్కముక్రిందఁదల్లికి నైదువందలును, ఇతరలాంఛనములుగాక మొత్తమూఁడువేలయేనూటరూపాయలకు గుదిర్చినాను.

శా—సరి! సరి! అదేనటండీ! గొప్పగా జెప్పుచున్నారు. నరసింహారావుగారికిఁ గళత్రవియోగమైన పిమ్మట నొక మంగలిదాని నుంచుకొని దానిచేతికూడు తినుచుండుటచే బ్రాహ్మణులెల్ల వానిని బహిష్కరించిరి. వారిద్దఱికిఁ బుట్టిన చిన్నదాని నేసుమండి తమరు మాట్లాడినది.

చ—నేనుమాట్లాడిన దేమున్నదండి? వారిసంగతి వీరును వీరిసంగతి వారును బూర్ణముగా నెఱిఁగియేయున్నారు. "నీవొకందుకుఁ బోయుచుంటివి. నేనొకందుకుఁ దాగుచుంటి" నన్నట్లు వరశుల్కమున కపేక్షపడి సూర్యనారాయణరావుగారును, సంఘమునఁ గలియవచ్చుననీ నరసింహారావుగారును ఈసంబంధము ను గుదుర్చుకొనినారు. మధ్యనా దేమున్నదండి! పది రూకల వాఁడను గాని.

అ—సంఘమున నెట్లుకలియుననండి? ఈవివాహము కానీయండి సభా పత్రము మేమందఱమును గట్టుకట్టి జగద్గురువులకు వ్రాసిస హేంద్రి తక్షణకాయయని యావివాహమునకుసంబంధించిన వారికెల్లరకు బహిష్కార పత్రికలు తెప్పింతుము.

చ—అమరావధానిగారూ! తొందఱపడకండి. ఆ వివాహములో నేనరసింహారావుగారు సత్యనారాయణ వ్రతమాచరించి పలువిధభక్ష్యములతో సమారాధన జరిగించి వచ్చిన బ్రాహ్మణులకు భూరిదక్షిణలిచ్చెదరఁట. అందు మీకుగొప్పసమ్మానముజరుగునట్లుచేతును. ఈవిషయము రహస్యముగా నుంచుఁడు.

అ—సరే! మీయిష్టప్రకారమే నేనును వర్తించెదను.

శా—చీ! చీ! పరిణయముల బాధ్యత నితరులెట్లుక్రమముగా నపహరించిరి.

చం. పరిణయమన్న భార్యయును భర్తయు బ్రాణములుండుదాక సం
సరణరథంబులాగెడు ద్విచక్రములై నడిపించుచు న్నిరం
తరమెడఁబాటులేక విపథంబుల ద్రొక్కక శాంతులై పర
స్పర సుఖదుఃఖబాధ్యులుగ వాసలొనర్చి వరించుటే కదా!

అట్టి పరిణయ మిప్పుడు బ్రాహ్మణకులము దెచ్చటనైన నుండెనా? హా! కాలమహిమ! (ఆలించి) అదిగో భేరిమ్రోగుచున్నది నైళమపోవలయును (లేచును)

చ—(ఆశ్చర్యముతో) ఏమండి శాయన్న శాస్త్రిగారూ! ఆ భేరియేమి? అచ్చటికి మీరేల పోవలయును?

శా—ఓహో! మీరెఱుఁగరు కాబోలును. జనకమహారాజుగారు "శివ ధనువు నెక్కుపెట్టినవారికిఁదనకూతుసీతనిత్తు"నని చాటించిరిగదా

చ—ఔను! జనకుఁడొనర్చిన దసాధ్యప్రతిజ్ఞ. ఆధనువు నెక్కుపెట్టు వారును లేరు. సీతకీజన్మమునఁ బెండ్లియునుగాదు.

శా—(నవ్వి) అమోఘ సంకల్పుఁడగు జనకుని ప్రతిజ్ఞ వృథయగు నా? అయోధ్యావల్లభుఁడగు దశరథేంద్రు నగ్రసుతుఁడు శ్రీ రామచంద్రుఁడావింటి నశ్రమంబున మోపెట్టుటలోఁ దునకలై యావిల్లు నేలఁబడినది.

చ—ఇక మనదారిద్ర్యము విచ్ఛిత్తగును. సీతాకల్యాణమగును.

శా—ఒక్క యుర్వీసుతోద్వాహమేకాదు జనకుని తమ్మునికూ తుండ్రగు ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తియను కన్యకలను ద శరథుని తక్కిన పుత్రులగు లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకిచ్చి యేకలగ్నమున వివాహమొనర్తురఁట.

అ—శుభము. ముహూర్తమెప్పుడు? దశరథాదులు వచ్చిరా?

శా—నేఁడే శుభముహూర్తము. దశరథుఁడును దత్పుత్రులును ద క్కుంగల పురోహితామాత్యసామంత బంధు మిత్ర పరివా

రంబులును వివాహమంటపమున కేగుచున్నారు. ఆ భేరీధ్వని యదేసుమా!

చ—మంచిది. ఇంటికేగిన నాలస్యమగును. శీఘ్రముగా నిదే దారినిమ నమును బోవుదము.

అ—వెళ్లుదమురండు. (అందఱును నిష్క్రమింతురు)

ఇదివిష్కంభము.

౩ రంగము—వివాహవేదిక.

(రామలక్ష్మణ భరతశత్రుఘ్నులును, సీతా, ఊర్మిళా, మాండవీ, శ్రుతకీర్తులును. దశరథ జనకాదులును, వసిష్ఠవిశ్వామిత్ర శతానందాదులును, ప్రవేశింతురు. మంగళ తూర్యారవంబులు మ్రోగుచుండును.)

శ—ఓరి! శిష్యా! అవకతవకశాస్త్రీ! అంకురార్పణ సంకల్పము గానీయరా!

అవ—చిత్తమట్లే కానిత్తును. (స్వ) నా మొగమేమి కానిత్తును? వచ్చినది కొంచెము మఱచిపోయినాను. అయినను సభలోరాదనుట మంచిదికాదు. ఏదియో చిన్నతనమున బడిలో నేర్చికొనిన భూగోళశాస్త్రమునుబట్టియు పూరాణమానమును బట్టియు నేదియో వాగుచు నేమియుఁ దోఁచనిచో మేళము వాయింపు మనుచుఁ గావింతును. (ప్ర) అయ్యా! సభవారి యాజ్ఞ గావించుచున్నాను.

(సంకల్పము)

అస్యశ్రీ మన్మహాగోళాకారసూర్యనారాయణ మండలచ్యుత పతన గోళాకృత భూమండలే, ఆసియామెరికాఫ్రికైరోపాస్ట్రేలి యాఖ్యమహాఖండమండి తాసియాఖండే, ఆర్కిటికంటార్కిటికట్లాంటికఫసిఫిక్కుహిందూనామ మహాసముద్రస్థ హిం

దూమహాసము ద్రోత్తరభాగవిరాజితే, నీలశ్వేత శోణహరిద్రి కాస్పియన్ మధ్యధరారేబియా బంగాళాఖాతాద్యుపసము ద్రస్యఅరేబియా సముద్రపూర్వదిగ్భాగే, బంగాళాఖాతపశ్చిమోత్తరభాగే, సైబీరియా, చైనా, మంగోలియా, మంచూరియా టిబెట్ అరేబియాపర్షియా ఆఫ్ఘనిస్థాన బర్మాహిందూదేశాది మహాదేశమధ్య హిందూదేశే, కలకత్తా, బొంబాయి, చన్నపట్నము, బీరారు, బేహారు, అస్సాము రాజపుత్రస్థానా గ్రామోధ్యాది రాష్ట్రాంతర అయోధ్యారాష్ట్రే, ఓబీ, లీనా, ఎన్సీ, హొయాంగు హోగంగాసింధూ బ్రహ్మపుత్రా ఐరావతీతపతీనర్మదా మహాగోదావరీ, కృష్ణాకావేరీయమునా, గోగ్రా గుంతీ, సరయూముఖ్యనదీ మధ్యసరయూనదీప్రాంతే, అయోధ్యామండలే శోభనగృహేసమస్త దేవతాసమస్తవర్ణసన్నిధే అస్మిన్ వర్తమానే వ్యావహారికహూణ మానేనఏకోనవింశచ్ఛతోపరివింశతితమసంవత్సరే, ఏప్రిల్ నామమాసే వింశత్యుపరిచతుర్థ దినేసుభనక్షత్రశుభయోగశుభకరణ ఏవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌపాణిగ్రహణాఖ్య కర్మకరిష్యే.

శ—ఓరీ! నీయింటిలో వానకురియ! యిదేమి సంకల్పమురా!

అవ—మఱచిపోయి నోటికివచ్చినట్లువాగినాను.

శ—మొదటనే రాదన్నచో బాగుండునే.

అవ—అట్లన్నచో నవమానముకాదా?

శ—ఇప్పుడు వచ్చినబహుమానమేమి? (వసిష్ఠునితో) స్వామీ! తమరు పాణిగ్రహణముకానీయండి

వ—(వధూవరులచేఁ సిల్లుపట్టఁజేసి) అస్యశ్రీమదాది నారాయణస్య అచింత్యాపరిమిత శక్త్యాభ్రిమాణస్య మహాజలౌఘమధ్యే పరిభ్రమ మాణానామనేకకోటి బ్రహ్మాండానామేకతమే వ్యక్తావ్య

క్తమహదహంకార పృథివ్యాపస్తేజో వాయురాకాశాద్యా వృణైరావృతే అస్మిన్మహతిబ్రహ్మాండకరండమండలే, ఆధార శక్తి శ్రీకూర్మవరాహానంతాద్యష్టదిగ్గజోపరిప్రతిష్ఠతలిమహానా ళాయమానఫణిరాజ రాజస్య శేషస్యసహస్రఫణాఫణామణి మండలమండితే; ఇంద్రద్వీపాశేరు తామ్రగభస్తినాగ సౌ మ్యగంధర్వచారణ భారతాఖ్యనవఖండమండితే, జంబూ ప్లక్షకుశక్రౌంచ శాకశాల్మలపుష్కర ద్వీపాత్మైస్సప్తభిర్వ్యాపితే, అంగవంగ కళింగ కాశ్మీర కాంభోజ సౌవీరసౌరాష్ట్ర మహారా ష్ట్ర మగధ మాళవ నేపాళకేరళచోళ గౌళబంగాళమళయా ళాదివివిధదేశ విరాజితే గంగావాలుకాభిసప్తర్షిమండల ప ర్యంతంబ్రహ్మలోకే నివాససిద్ధ్యర్థంయావతీగుణీకృతాగ్నిష్టో మాతిరాత్రాప్తోర్యామ సాంతవనవాజ పేయపౌండరీకాశ్వ మేధాది శతక్రతుఫలసిద్ధ్యర్థం స్వగుహ్యోత్తరప్రకారేణ సా లంకృత సహిరణోదక కన్యాదానమహంకరిష్యే—(జనకుని చేత నీరుతాకించును)

1 శ్లో—కన్యాం కనకసంపన్నాం। కనకాభరణైర్యుతాం
దాస్యామివిష్ణవేతుభ్యం। బ్రహ్మలోకజిగీషయా॥
2 శ్లో—శ్రీరూపైషామయాకన్యాం। తుభ్యంశ్రీధరరూపిణే।
ఇత్యుక్త్వోదకపూర్వేణ। దద్యాతస్మైత్రివాచకమ్ 2

చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభంభవతు. కాశ్యపవత్సా రనైధ్రువ త్రయార్షేయ ప్రవరాన్విత కాసపసగోత్రోద్భవస్య నాభా గరాజవర్మణోనప్త్రే అజమహారాజవర్మణః పౌత్రాయ దశరథమహా రాజవర్మణః పుత్రాయ శ్రీరామచంద్ర నామధేయాయ వరాయ.

(ఇట్లే తక్కినముగ్గురకు)

చతుస్సాగర పర్యంతంగో బ్రాహ్మణేభ్యః శుభం భవతు ఆత్రేయ

యవనాశ్వ స్వావాశ్వ త్రియార్షేయ ప్రవరాన్విత ఆత్రేయసగోత్రోద్భవస్య హ్రస్వరోమవర్మణోన ప్త్రీంస్వర్ణరోమవర్మణో పౌత్రీంజనకమహారాజవర్మణః పుత్రీం సీతానామ్నీం కన్యాం, అస్తిప్రతిపాదయామీతివరోవదేను.

శ్లో—కనకవిరచితాంగం । గంధపుష్పాదిపూజా ।
బహువిధశుభనాదం । బ్రాహ్మణాశీర్వదంవా ।
సకలగ్రహశుభస్థే । కన్యకాకంఠమధ్యే ।
ఉభయకులసుశీలాం । మంగళం సూత్రబద్ధం ॥

(ఇట్లేడమమున్వారకు మంగళసూత్రధారణముచేయించును)

జ—ఉ. ఈమెమదీయపుత్రిక సు । మాసుగుణోదధి, ముద్దరాలు, నా
నామనుజేంద్రనందన మ । నః ప్రసవార్చితపూత, సీత ని
న్నేమదినిల్పునింకితర । మెన్నదు, నీసహధర్మచారిణిం
బ్రేమమెయిన్ భరింపుమొక । రీతిగఁ దప్పులదిద్ది రాఘవా !

వ—నాయనా ! రామచంద్రా ! అగ్నిసాక్షిగాఁ బ్రమాణమొనర్పుము.

రా.—చ. అనలుఁడుసాక్షిగాఁ గననఁ । యంబుఁద్రిశుదిగ మేనఁబ్రాణమే
యనుపునవిల్పుకొందునటు । లారసిప్రేముడిసీతఁ బ్రోతుని
వ్వనరుహనేత్రి, దక్కఁబర । భామలస్వప్నములోననైనఁ గో
రనుబురుషార్థసిద్ధికిఁ జి । రంబుగయత్నముసేతునీపెతోన్

శ—అమ్మా ! సీతామహాసాధ్వీ ! నీవునుబ్రమాణమొనర్పుము.

తే. గీ. పంచభూతంబులనలుండు । భాస్కరుండు
చంద్రుఁడు సమస్తవిబుధులు । సాక్షులుగను
మనసునను వాక్కునను గర్మ । మునను రామ
భద్రుపాదాబ్జములఁగొల్చి । పాయకుందు.

(లక్ష్మణ భరతశత్రుఘ్నులు వేఱువేఱుగా)

తే. గీ. ఈనెలఁత దక్కఁబరకాంత । నెనయకుందుఁ
బ్రాణమున్నంతవఱకు ని । బద్ధిసుండు

(ఊర్మిళామాండవీ శ్రుతకీర్తులు వేఱువేఱుగా)

ఈపురుషుఁడక్కఁ బెరవాని నెంచఁజాలఁ

బ్రాణమున్నంతవఱకును నిబద్ధినుండు.

చా—(నలువురుకొమార్తెలఁ జేరఁదీసి) తల్లులారా! మీరింక నత్త వారియింటికిఁబోయి యచ్చటఁ దలలోనినాలుకరీతి మెలంగుచుఁ గాపురము సేయవలయును. మీరన్నిటఁగుణవంతులేయైనను జెప్పవలసిన బాధ్యతనాయందుఁగలదు. కానఁ గొన్నినీతులెఱిగింతువినుఁడు.

కం. సతికిఁబతియొగతిదైవము

పతిపరమాప్తుండు నేత బంధుఁడు గురుఁడా

పతిఁగాదనినిరసించిన

యతివకిహపరములఁ గష్టమబ్బునుజుండీ!

సీ. అరుణోదయంబున కటము న్నెతనభర్త

కంటెనుముచ్చు మేల్కాంచవలయుఁ

గాల్యకృత్యంబులు క్రమతనిర్వర్తించి

శుచియయిప్రాణేశుఁ జూడవలయు

భర్తనిద్దురలేవ భావంబుగుర్తించి

పరిచర్యభక్తి సల్పంగవలయుఁ

దల్లిదండ్రులభాతిఁ దనయత్తమామల

కింపుసంధిల్లఁ బూజింపవలయుఁ

తే. గీ. గురుజనంబుల ననయంబుఁ గొలువవలయుఁ

బరిజనంబులఁ బ్రేమఁగాపాడవలయు

బీదసాదలఁ గరుణతోఁ బెంపవలయు

మఱఁదులనుదమ్ములని తలంపంగవలయు.

యవనాశ్వ స్వావాశ్వ త్రియార్షేయ ప్రవరాన్విత ఆత్రేయసగోత్రో ద్భవస్య హ్రిస్వలోమివర్మణోన ప్త్రింస్వర్ణరోమవర్మణో పౌత్రీంజనక మహారాజవర్మణః పుత్రీం సీతానామ్నీం కన్యాం, అస్తిప్రతిపాద యామీతివరోవదేను.

శ్లో—కనకవిరచితాంగం। గంధపుష్పామిపూజా।
బహువిధశుభనాదం। బ్రాహ్మణాశీర్వదంవా।
సకలగ్రిహాశుభస్థే। కన్యకాకంఠమధ్యే।
ఉభయకులసుశీలాం। మంగళం సూత్రబద్ధం॥

(ఇట్లు వడమున్వరకు మంగళసూత్రధారణముచేయించును)

జ—ఉ. ఈమెమదీయపుత్రిక సు గే మీసుగుణోదధి, ముద్దరాలు, నా
నామనుజెందరినందన మ గే నః ప్రసవార్చితపూత, సీత ని
న్నేమదినిల్పునింకితర గే మెన్నదు, నీసహధర్మచారిణిం
బ్రేమమెయిన్ భరింపుమొక గే రీతిగఁ దప్పులదిద్ది రాఘువా!

వ—నాయనా! రామచంద్రా! అగ్నిసాక్షిగాఁ బ్రమాణమొనర్పుము.

రా.—చ. అనలుఁడుసాక్షిగాఁ గననఁ గే యంబుఁద్రిసుదిగమేనఁ బ్రాణమే
యనుపుననిల్పుకొందునటు గే లారసిపేర్మిుడిసీతఁ బ్రోతుని
వ్వనరుహనేత్రిఁ దక్కఁబర గే భామలస్వప్నములోననైనఁ గో
రనుబురుషార్థసిద్ధికిఁ జి గే రంబుగయత్నముసేతునీపెతోఁ

శ—అమ్మా! సీతామహాసాధ్వీ! నీవునుబ్రమాణమొనర్పుము.

తే. గీ. పంచభూతంబులనలుండు గే భాస్కరుండు
చందురుఁడు సమస్తవిబుధులు గే సాక్షులుగను
మనసునను వాక్కునను గర్మ గే మునను రామ
భద్రుపాదాబ్జములఁగొల్చి గే పాయకుందు.

(లక్ష్మణ భరతశత్రుఘ్నులు వేఱువేఱుగా)

తే. గీ. ఈనెలఁతఁదక్కఁబరకాంత గే నెనయకుందుఁ
బ్రాణమున్నంతవఱకు స గే బద్ధిసుండు

(ఊర్మిళామాండవీ శ్రుతకీర్తులు వేఱువేఱుగా)

ఈపురుషునకక్కఁ బెరవాని నెంచఁజాలఁ
బ్రాణమున్నంతవఱకు ని బద్ధినుండు.

చా—(నలువురుకోమార్తలఁ జేరఁదీసి) తల్లులారా ! మీరింక నత్తవారియింటికిఁబోయి యచ్చటఁ దలలోనినాలుకరీతి మెలంగుచుఁ గాపురముసేయవలయును. మీరన్నిటఁగుణవంతులేయైననుజెప్పవలసిన బాధ్యతనాయందుఁగలదు. కానఁ గొన్నినీతులెఱింగింతువినుఁడు.

కం. సతికిఁబతియెగతిదైవము
పతిపరమాప్తుండు నేత బంధుఁడుగురుఁడా
పతిఁగాదనినిరసించిన
యతివకిహపరములఁ గష్ట మబ్బునుజుండీ !

సీ. అరుణోదయంబున కటమున్నెతనభర్త
కంటెనుమున్ను మేల్కాంచవలయుఁ
గాల్యకృత్యంబులు క్రమతనిర్వర్తించి
శుచియయిప్రాణేశుఁ జూడవలయు
భర్తనిద్దురలేవ భావంబుగుర్తించి
పరిచర్యభక్తి సల్పంగవలయుఁ
దల్లిదండ్రులభాతిఁ దనయత్తమామల
కింపుసంధిల్లఁ బూజింపవలయుఁ

తే. గీ. గురుజనంబుల వినయంబుఁ గొలువవలయుఁ
బరిజనంబులఁబ్రేమఁగా పాడవలయు
బీదసాదలఁ గరుణతోఁ బెంపవలయు
మఱఁదులనుదమ్ములని తలంపంగవలయు.

గోపా.—నిజమే. జనకమహారాజుగారిసంగు దాసజనంబులలో నన్నుఁ గూడఁ జేర్పకపోయెనే.

గోవిం.—పాపమాయన మాత్రమెందఱినిబంపును? ఎల్లరకుమనయట్టులే కోరికయుండుట సహజము. ఇప్పటికే దశరథమహారాజు కొనివచ్చిన సైన్యమును మనమహారాజుగారిచ్చిన యరణమును గలిసి యొకసముద్రమువలె నున్నది.

గోపా.—(ఆలించి) అదిగో! ప్రయాణభేరి మ్రోఁగుచున్నది. బయలుదేరిరి కాఁబోలును. మనమేగి యాపుణ్యమూర్తులను దర్శించి వత్తము.

గోవిం.—మంచిది. పోదముపద. (నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.

గద్యము.

ఇది ఋక్కుర్తి తిరుపతిరాయవిరచితోర్వీసుతోద్వాహంబునం జతుర్థాంకము.





# ఉర్వీసుతోద్వాహము.

పంచమాంకము.

1 రంగము. అరణ్యపథము.

[దశరథ వసిష్ఠ రామలక్ష్మణులు ప్రవేశింతురు.]

ద—గురువర్యా! ఇప్పుడంత తొందర యేమివచ్చినది?

వ—వచ్చినది కాదు. రానున్నది. అతిశీఘ్రముగా రానున్నది. సీతాది స్త్రీజనమును బరిసరపర్వత గుహాంతరమునఁ గొంతసేపుంచి భరతశత్రుఘ్నుల నటఁగాపుంచుఁడు.

ద—ఏల మహాత్మా! అట్లు సెలవిచ్చెదరు ?

వ—కాంతామణులు కదనరంగ ఘోరదర్శనముకుఁ దగరు. రాజేంద్రా! భరతాదులు నీకోడండ్రతో నిటువచ్చుచున్నారు. వారి నటులఁ బొమ్మని ముంగుగా నాజ్ఞాపింపుము.

ద—సామంత్రీ! నీవుపోయి స్త్రీజనములతో మెల్లఁగవచ్చుచున్న భరతశత్రుఘ్నులకు మహర్షి యాజ్ఞ తెలియఁ జెప్పియిటు వేగ రా.

ల—చిత్తము. (నిష్క్రమించును)

ద—మహాత్మా! కదనరంగమనెద కేల? ఘోరదర్శనమనెద కేల? తాటక నామమాత్రావశిష్టగాఁ జేయఁబడినది కాదా ? మారీచుఁడంత రిక్షమున కెగురఁ గొట్టబడెనుగాదా ? సుబాహుఁడు వీరస్వర్గ మనుభవింపుచున్నాఁడుకాదా? ఇఁకను గదనరంగ ప్రసక్తి యేమున్నది ?

సీ. కష్టంబులెల్లను ఽ గడచెను నలువురు
కొడుకులొక్కటఁ బెండ్లి ఽ కొడుకులైరి
పచ్చపచ్చగఁ గొత్త ఽ పసపుఁ బంచెలుతోడ
నరణంబులోడుల బి ఽ య్యములతోడ
నతిసుప్రసన్నము ఽ ఖాంబుజంబులతోడఁ
గోడండ్రునలువురుఁ ఽ గూడరాఁగ
వివిధవాద్యంబులు ఽ విప్రులుబాంధవుల్
సామంతులిష్టులు ఽ సందడింప
తే. గీ. నుత్సుకతనయోధ్యకు నేగు ఽ చుండమార్గ
మధ్యమందుమహాత్తుగా ఽ మనకునిప్పు
డెవరివలన నేకీడుసం ఽ కెట్లువచ్చు
ఘోరదర్శనమదియేమి ఽ గురువరేణ్యా!

వ—రాజేంద్రా! ఇప్పుడే తెలియనున్నది. రామా! ధనుర్ధరుఁడవై భద్రముగానున్నావుకదా?

రా—చిత్తము.

(తెరలో) ఏఁడీ! రాముఁడేడీ! ఆతనికొఱకే వచ్చుచుంటిని.

ద—(అదరిపడి) గురువర్యా! అతఁడెవఁడు?

(తెరలో) తే. గీ. క్షత్రియశ్రేష్ఠవంశవం ఽ శదవవహ్ని,
భృగుకులాంభోధి పార్వణ ఽ విధుఁడుజామ
దగ్న్యుఁడధిక తపశ్శాలి ఽ దర్పిమపరశు
రాముఁడట్టి నన్మఱచినా ఽ రాజసుతులు.

ఏఁడీ? ఆరాముఁడేడీ? నాయెదుట మఱియొకరాముఁడా? (తిరిగి తెరలో లక్ష్మణుఁడు) ఏఁడీ! ఏఁడీ! ? తిన్నఁగ మాటలాడుటయైనఁ జేతకాదా? రాముఁడేటికి? నీపనికి—రామానుజుఁడనైన నేనుజాలనా? ఇదిగో వచ్చుచున్నాను.

రా—సౌమిత్రీ ! నీవాగుము ! మహాతపస్విని యెడల సగౌరవముగాఁ బలుకవలయును. నీవాయనను సమీపింపవలదు. ఇటురమ్ము.

ల—(ప్రవేశించి)మీ యెడల సగౌరవముగ మాటలాడుచున్న యీ పరశురాముని శిక్షింప ననుజ్ఞ నేలయీయరు ?

(పరశురాముఁడు ప్రవేశించును) 26

ద—గురువర్యా ! అనునయవాక్యములచే నీక్షత్రియవంశనాశకుని శాంతిపఱచినఁ గాని మనకు బ్రదుకులుదక్కవు. కావున మీరు ముందుగా నాతనిసమీపించి.

వ—జామదగ్న్య ! పితృవధామర్షాగ్నిని క్షత్రియరక్తవర్షమున శాంతిపఱచి విగతతాపుఁడవై సంతుష్టచిత్తుఁడవై మహేంద్రాద్రి యందుఁ దప మొనర్చుచున్నావని వింటిని. తపమునిర్విఘ్నముగా వర్ధిల్లుచున్నదా ?

ప—ఇదిగో ! ఇంతసౌభాగ్యముగా వర్ధిల్లుచున్నది. నేను శాంతి పొందెదనన్నను లోకము నన్నుఁ బొందనీయకున్నదే!

తే. గీ. ప్రకటితాస్మత్ప్రతాపరూ పకమునాఁపి
యొరులునాకంట నేనును నొరులకంట
బడక యుండ గాలంబును గడపుచుంటిఁ
బరమమునివృత్తిని మహేంద్ర పర్వతమున.

అట్టినన్నుఁ దిరుగఁ బిరలోకమునఁ బడవైచిన వాఁడెవఁడు ? అనేక కోటి క్షత్రియకంఠనాళ విఖండన ప్రచండకోటియగు నీపరశువును దిరుగు న్యాచేఁ బట్టించిన వాఁడెవఁడు ? కతిపయవిస్ఫులింగావశిష్టముగా నాఱిపోయిన నాకోపాగ్నిని దిరుగనింధనములు వైచి బుద్ధిపూర్వకముగాను ప్రజ్వలింపఁ జేసినవాఁడెవఁడు ? ఇదిగో ! ఈరాముఁడు ! ఈక్షత్రియడింభకుఁడు.

ల—(రహస్యముగా) అన్నగారు ! ఏమిసెలవు ? వేయనా ? దాడవిఱుగునట్లు వేయనా ?

రా—(రహస్యముగా) తొందరపడవలదు. పెద్దలేతగురీతినిదిద్దు బాటొనర్చెదరు.

ద—మహాత్మా! జామదగ్న్య! నమస్కారము. ఈకుర్రఁడు, ఈపసిబాలుఁడు—ఈశాంతస్వభావుఁడు మీయెడలనేమి యపరాధమొనర్చినాఁడు? దయయుంచి రక్షింపుఁడు.

ప—నిన్ను వెనుకరక్షింపఁదలఁచి యుపేక్షించుటచేతనే మాకు శాంతిభంగమాయఁజాలిన—మమ్ముఁ బరాభవింప సందేహింపని కొడుకును గని మిడిసిమిడిసిపడుచున్నావు. వాడుకలేమిచేఁ బరశువునకు వాఁడితగ్గినదనుకొనుచున్నావు కాఁబోలు? వార్ధకముచే బాహువునకుఁ బటుత్వము తగ్గినదనుకొనుచున్నావు కాఁబోలు?

ల—అయ్యా! విశ్వామిత్రశిష్యులగు దాశరథులను బెదరింపరాకుఁడు. పరశువును—

ద—(రహస్యముగా) నాయనా! నీకేటికోయి! నీవూరకుండుము. (ప్రకాశముగా) మహాత్మా! జామదగ్న్య! గురుభక్తియుక్తుఁడు—దోషరహితుఁడు—అమృతమయాంతఃకరణుఁడగు నీచిన్నబాలుఁడు మీశాంతికెట్లు భంగమొనర్చినాఁడు? మిమ్మెట్లు పరాభవింపనున్నాఁడు?

ప—పరాభవింపనున్నాఁడు కాదు—పరాభవించినాఁడు.

ద—ఏదియో వంకపెట్టుకొని మమ్ముహింసింపవచ్చినారు. ఇది న్యాయముకాదు. నేను వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నాను. చిరకాలమునకుఁ బుత్రివంతుఁడనైతిని. రక్షింపుఁడు.

ప—వంకపెట్టుకొనివచ్చితినా? పరశురాముఁడసత్యవర్తనుఁడా?

వ—జామదగ్న్య! అదియంతయు నేటికి? సత్యాసత్యవర్తన నిర్ణయమిప్పుడేల?

కం. పురుహూతుని సమ్ముఖమున।
శరసన్న్యాస్య సంభూనర్చి కే జగతిని మరలం
బరశువును బట్టలేదే?
యరగుదు రవసరముఁబట్టి కే యాచారముగ౯

మిమ్మెట్లు శ్రీరాముఁడు పరాభవించెనో యాసంగతి చెప్పి యేదైః దోషమున్న యెడల క్షమింపఁ దగును. తపస్సంపన్నులకు దోషక్షమ కంటె భూషణము వేఱొకటియున్నదా?

ప—నన్నుఁ బరాభవించిన నేను పేక్షించియే యుందును. నాయిష్టదైవ మగు మహాదేవునిఁ బరాభవింపలేదా?

ద—విల్లు విఱిచియేనా?

ప—కాదా? త్రిపురసంహారి యగునిటలాక్షునిపై నిర్లక్ష్యభావమా? కరుణాళుఁడగు నామహాదేవుఁడీ నేరమును పేక్షించినను, భక్త వతంసుఁడను, బరతేజస్సహానాభావుఁడను, బరశురాముఁడను నైననేను పేక్షించుట తగునా?

ల—తగకపోయిన నిప్పుడు చేయఁదలసిన దేదోచేయరాదా?

ద—(రహస్యముగా) నాయనా! మండుచున్నయగ్నిపై నేయిపోసెద వేమి? నీకా లోకోత్తరుని మహాతేజః ప్రభావము తెలియదు. నీవూరకుండుము (ప్రకాశముగా) అయ్యా! ఆతఁడుచిన్న వాఁడు. క్షంతవ్యుఁడు. శివధనువును, సజ్యముచేయుట జనకచక్రవర్తి పణముగానిడిన కారణమున శ్రీరాముఁడు దానికిసాహసించెను. లేకున్న నాతనికావింటితో నేమిపనియున్నది?

ప—అట్లుపణముగానిడుట జనకునితప్పు కాదని నేనంటినా? ఆతఁడు కూడమమ్మును మహాదేవునిఁ బరాభవించినవాఁడే. ఆతనిమాట తరువాతఁజూతము.

తే. గీ. తెలిసియో తెలియకో మహా । దేవధనువుఁ
బణముగా నుంచె జనకుండు । పాడితప్పి
విశ్వమునకెల్లఁ దామేటి । వీరుఁడనని
ధనువు విఱుచుట కితఁడు సి । ద్ధపడ నేల?

వ—జామదగ్న్యా! ఇప్పటికి రాముడేకాక జనమహారాజుగూడ శిక్షార్హుఁడని తెలిసినది. బాగుగానున్నది.

సీ. పణముగా నిడినది । పరిణయార్థముగాన
సీమంతినీమణి । సీత తప్పు
మిథిలాపురికి యజ్ఞ । మిష రాము వెంటఁగొం
పోయెనుగాఁగా । ధేయు తప్పు
దశరథుఁడొప్పని । తఱిఁ జెప్పి కుశికసం
దను వెంటఁ బంపుట । నాది తప్పు
విల్లె లేకున్నసి । వింతలు పొసఁగవు
కానఁ జేసిన విశ్వ । కర్మ తప్పు

తే. గీ. తప్పులీరీతి నింకనెం । దఱికిగలవొ
యందఱను బట్టి శిక్షించి । యాతమీఁద
నీవొకండవె శౌర్యంబు । నెఱపుకొనుచు
దండిగ సురక్షితుండవై । యుండుమయ్య!

వ—వసిష్ఠా! నాస్వభావమెఱిఁగి యుండియు నీవట్లుమాటలాడుదువా? నేను సురక్షితుఁడనై యుండువాఁడనా?

ఉ. క్షత్త్రియ వంశమెల్లఁ బలు । సారులు మారణ మాచరించి తీ
ధాత్త్రిని గాశ్యపాఖ్యవసు । ధాసురుపాలొనరింపవాఁడనా
క్షేత్త్రమునందు నిల్వకుము । చేరుమిఁకొండొక చోటికంచు నే
మాత్త్రము జాలిలేకయన । మాటకు గాలిని నల్లలాడనే?

ఇది సురక్షితునిగతియేనా? నేను నాకొఱకే పాకులాడువాఁడనైన యెడల నిట్లాచరించి యుందునా? ధనుర్భంగము వలనమహాదేవా

పరాధము జరిగినదిగదా! యని నేను బతపించుచుంటిని భగవదపరాధమాచరించిన యాతఁడు (అర్థోక్తిలో)
ద—మీదయచే క్షమింపఁ బడఁదగినవాఁడు. మహాత్మా! నాకుఁబుత్రి భిక్ష పెట్టుము.
రా—(రహస్యముగా) తండ్రిగారు! నన్నీ బ్రాహ్మణోత్తముఁడేమియుఁ జేయఁజాలఁడు. మీరుపుత్రివాత్సల్యము సందేహింపవలదు. మీరొక్కగడియసేపు మాత్రమాతని ననునయింపక యూరకుండుఁడు. నేనుదగినట్లాచరించి యామాత్మని శాంతిపఱచిపంపెదను.
ద—(రహస్యముగా) నాయనా! నాతండ్రీ! నీవంత పనికిఁజాలుదువా?
రా—(రహస్యముగా) ఏమియు సందేహింపకుఁడు. మీశలవు లేకుంటచే నేనీభార్గవునితో నింతవఱకు మాటలాడ లేదు.
ద—(రహస్యముగా) నాయనా! నీ కులదేవతలు నిన్నురక్షింతురుగాక! భగవానుఁడగు వసిష్ఠమహర్షి మంగళాశాసనమునిన్ను సదా యనుసరించుఁగాక! మీతల్లికడుపు చలువనిన్నుఁ జిరంజీవిఁ జేయుఁగాక!
రా—(రహస్యముగా) తండ్రిగారూ! అనుగ్రహింపఁబడితిని.
ద—(రహస్యముగా) నాయనా! గురువులవారితో మనవిచేయలేదు. మహాత్మా! శ్రీరాముఁడు పరశురామునితో సంభాషించి యాతనిశాంతి పఱచెదనని నాతోఁజెప్పుచున్నాఁడు. అంగీకరింపవచ్చునా ?
వ—(రహస్యముగా) ఆతనిశాంతి శ్రీరాముని చేతిలోనున్నది; కాని దానికి మనముతగుదుమా? అవశ్యమంగీకరింపుము.
ద—(రహస్యముగా) నాయనా! గురువులవారనుజ్ఞ యిచ్చిరి.
రా—మహాప్రసాదము! బ్రాహ్మణశిఖామణీ! ఇంతసేపటి నుండియు

నన్నుఁగూర్చియే మీరుప్రసంగించుచున్నను గురునాజ్ఞ కాకుం
డుటచే మీతో సంభాషింపక యూరకుంటిని. క్షమింపవలయు
ను. ఇదిగో నమస్కరించుచున్నాను (నమస్కరించును)

ప—(తిరస్కారముగా)భగవానునకుఁ బరిభవమును, భక్తునకుఁబ్రి
ణామమునా? ఈనూతనాచారమెక్కడ నేర్చుకొంటివి?

రా-కం. వృద్ధుఁడవని పారుఁడవని
యిద్ధతపశ్శాలివనుచు నెఱిగితిఁ జుమినీ
యౌద్ధత్యమునకు శౌర్యస
మృద్ధికి భయపడినమస్కరింపమహాత్మా!

మఱియుఁ ద్రిపురాంతకుఁ బరిభవించు నుద్దేశమేమియు లేదు. ఆమహా
త్ముని ధనువును సజ్యముచేయఁ బ్రియతించితిని.

ప—సజ్యమేకాదు భగ్నముకూడఁ జేసితివి. నేను నీభుజవీర్యమునకు
మిగుల మెచ్చితిని, కాని—(అర్ధోక్తిలో)

ల—మీమెప్పుతో మాకేమియుఁ బనిలేదు.

ప—అట్లనెదవేల నామెప్పే మెప్పు.

తే. గీ. శూరు శూరుండె తెలసి మెచ్చుకొనవలయుఁ
గాని పందలు మెచ్చినఁ గలదెకీర్తి?
సత్కవి కవిత్వ చతురత సత్కవియె గ్ర
హించి మెచ్చంగఁ దగుశుంఠ లెన్ననేల?

శివధనుర్భంగమున రాముని బాహుపరాక్రమ సంపూర్ణత వెల్లడియైన
ది. అంతవఱకొప్పుకొనక తప్పునా? కాని దానితో దైవాపరాధము
కూడ—

రా—మహాత్మా! జామదగ్న్యా! మీమాటకు వ్యతిరేకముగఁ జెప్పితి
నని మీరనుకొనవలదు. ధనుర్భంగ కార్యమున నాభుజబల
సంపత్తియేమియు వెల్లడికాలేదు. భుజబలముపయోగించువఱ

కేది? పట్టుకొనిరవంత వంచుటకుఁ బ్రయత్నించు నప్పటికే యదిపెళ్లున విఱిగిపోవనేనేమిచేయఁ గలను? మహాత్మా! దాని వలన మహాదేవాపరాధము నాపై మీరుకట్టఁ దగదు.

ప—హా! హా! హా! ఏమి! ఎంతవాఁడవు! పట్టుకొనుట తోడనే భర్గచాపము భగ్నమైపోయినదా? బళీ! ఏమిపౌరుషవిజృంభణము! శివునిధనువు నీచేతిలోఁజీపురుపుల్లయైపోయెనా? ఏమివీరాలాపములు! క్షత్రియవీరశిరోవారముతో స్వర్గమునకు మెట్లులు కట్టిన పరశురాముని యెదుటనే ప్రతాపప్రగల్భతా ప్రాచుర్యమా? ఇరువదియొక్క దండయాత్రలొనర్చి క్షత్రియలోకమారణముమే మొనర్చినకథ నీవు వినియుంటివికాదా?

రా—అప్పుడు శ్రీరాముఁడు జన్మింపక పోవుటచేత మీకంతశ్రమము కలిగినది.

ప—(అట్టహాసము మొనర్చి) ఆ! ఆ! ఇపుడు వీరాధి వీరుఁడవు పుట్టితివి కాదా! జగదేకమహావీరశిఖామణివై ధ్భవించితివి కాదా? శంకరధనుఃఖండనుఁడవైతివి కదా? ఇదిగో వైష్ణవధనువు. దీనినిసజ్యమొనర్చి నాతో ద్వంద్వయుద్ధమునకురమ్ము. దీనికొఱకే వచ్చితిని. దీనికొఱకే తపస్సు చాలించితిని. దీనికొఱకే తిరుగఁ బరశువును బట్టితిని.

ద—(రహస్యముగావసిష్ఠునితో) గురువర్యా! పరుశురాముఁడు భీకరాకారుఁడై యున్నాఁడు ఏమిచేయునో?

వ—(రహస్యముగాదశరథునితో) చేయిచేసికొనఁగలవాఁడింతనోరుచేసికొనునా? భయములేదు—

ప—దశరథరామ! మాటలాడక యూరకుంటివేల?

రా—వైష్ణవధనువును సజ్యము చేయుమని యాజ్ఞాపించితిరి. ఇదివఱకే యొక్కదైవాపరాధము నాపైవైచినారుకదా! నేనుదానికెట్లు సాహసింతును?

ప—హా! హా! హా! శివధనువును విఱిచినట్లే దీనినిగూడ విఱువఁగలన నుకొనుచున్నావు కాఁబోలు! పూర్వము శివకేశవుల యుద్ధమందు విష్ణుఁడొనర్చిన హుంకారముచే శివధనువుకొంత సారహీనమయ్యెను. విష్ణుధనువును విఱుచు మాట యటుండనిమ్ము. నీవు దానిని వంపనైనలేవు. ఇదినిశ్చయము. ఇదిగోధనువు.

శ్రీ—మీమాటయు సత్యముచేయవలసినచ్చునుగదాయనివిచారించుచున్నాను. ధనువక్కఱలేదు. దానినివంచుటయొకవిశేషముకాదు వంచినట్లే యెంచవచ్చును. వంచినపిమ్మట మీతో ద్వంద్వయుద్ధమని మఱియొకమాటసెలవిచ్చితిరే! అయ్యయ్యో! వృద్ధులు, బ్రాహ్మణులు, తపస్సంపన్నులు, పూజ్యులునగు మీతో ద్వంద్వయుద్ధమొనర్చుటకు నాకుఁ జేతులువచ్చునా? తాటకయని చంపనా? సుబాహుఁడని మడియింపనా? మారీచుఁడని యెగురఁగొట్టనా? అయ్యయ్యో! ఎంతమాట!

ప—(కోపముతో) ఆ!ఆ! ఏమంటివి?

ల—ఆయన యేమనెనో నేను స్పష్టముగాఁ జెప్పెదను వినుఁడు. మీ భుజమునకు జన్నిదమర్హము; కాని చాపము కాదు. మీచేతికి గోముఖమర్హము, కాని శిలీముఖముకాదు. మీచౌరవకు వంట శాలలర్హములు, గాని యాహవరంగములు కావు.

రా—లక్ష్మణా! పూజ్యులన ధిక్షేపించకుము. మహానుభావా! శిరము వంచి రెండు చేతులుజోడించి భక్తితోనమస్కరింపవలసిన మిమ్మునింత వఱకమోఘమనిపించుకొనిననాబాణమునకు గుఱి చేయఁగలనా? నాయస్త్రవిద్యాగ్రహణము దీనికొఱకేనా? కావుననన్ను క్షమింపుఁడు. (27)

ప—నేను బ్రాహ్మణుఁడననియు, నాకారణమునఁ గాతరుడననియు సందేహించుచుంటివా? అట్లెంచుట కేవలముతప్పు. ఇదిగోగొ

డ్డలి! ఇదిగో గోముఖము! ఇదిగో యజ్ఞసూత్రము! ఇదిగో ధను సూత్రము! ఇదే బ్రాహ్మము! ఇదే క్షాత్రము! నీకొక్క చాపబల మే; కాని మాకు శాపచాపబలములు రెండున్నవి తెలిసిన దా? జాగ్రత్త.

రా—మీ చాపబలమునకు జడియువాఁడను గాను. మిమ్ము గురుతుల్యు లుగ భావించి సేవించునాకుఁ బూజ్యులగు మీ రేల శాపమిచ్చె దరు? కావున మీ శాపమును గుఱించియు జడియువాఁడను గా ను భవదాశీర్వాదపాత్రుఁడనగు నన్ను క్షమించి ద్వంద్వయుద్ధ ప్రశంసను విడిచి మా దారిని మమ్ము బోనీయుఁడు.

ప—నేనంగీకరింపను. నీతో నాకిప్పుడు యుద్ధము తప్పదు! తప్పదు! తప్పదు.

రా—మహాత్మా!

తే. గీ. " పరశురాముఁడు నాకక్క కొడుకు " డనుచు
నస్త్రగురుఁడు విశ్వామిత్రుఁ డానతిచ్చె
నామహాత్ముఁ డొసంగిన యస్త్రసమితి
తోడ గురుబంధు, బ్రాహ్మణుఁ ద్రుంపనగునె?

ప—నేనొనర్చిన సర్వక్షత్రాంతక యజ్ఞమునందలి హోమకుండమున విశ్వామిత్రుఁడు నాకు బంధుఁడని యే యాహుతిగఁ జేయక మిగి ల్చితిని; అంతేకాని యాతని యస్త్రములకు జడిసి కాదు.

ల—తల్లి నిజంపినవానికి దాతగారి యెడల నీదాక్షిణ్యమేల?

ప—రామ నుత! జాగ్రత్త! రామా! నాకు వీరావేశమెత్తుచున్నది! ఈ వైష్ణవధనువును సజ్యమొనర్చి నాతో ద్వంద్వయుద్ధ మొనర్చెద వా లేదా? అట్లు చేయని యెడల మిమ్ము ద్దఱను శాపముచే భస్మ ముచేసి మఱి పోవుదును (తీవరించును)

రా—మహాత్మా! ఎంత చెప్పినను వినకుంటిరి కదా! విధియిట్లు ప్రేరి

ణచేయుచుండ మీరేమిచేయఁగలరు ! కానిండు ఏదీ ! మీవైష్ణవధనువు ? (28)

ప—సెభాసు ! రామభద్రా ! ఇదిగో ! (ధనువిచ్చును)

రా—( ధనువుతీసికొని కన్నులకద్దుకొనును )

ద—(రహస్యముగా) రామచంద్రా ! దానినివిఱుతువేమో జాగ్రత్త సుమా ! ఆమహానుభావునికి మఱింత కోపమువచ్చును.

రా—(రహస్యముగా) మఱేమియు భయములేదు.

వ—(రహస్యముగా) దశరథా! ధనువునురామచంద్రుడు పరశురాముని హస్తమునుండి తీసికొనునప్పుడాతని తేజమునుగూడ నాకర్షించుకొనినాడుసుమా !

ద—(రహస్యముగా) అది మీకెట్లు తెలిసెను?

వ—(రహస్యముగా) ఒక తేజమురామునిలో గుప్పునఁబ్రవేశించినట్లు నాకగపడెను. అదికాక పరశురాముఁడెంత నిస్సారుడై, తేజశ్శూన్యుఁడై, దీనుఁడైయున్నాఁడో ! చూడు !

ద—ఔను, ఆహా ! రాముఁడు ధనువునువంచినాఁడు.

వ—సెబాసు ! రామభద్రా !

రా—(విల్లెక్కు పెట్టి) మహాత్మా ! జామదగ్న్యా ! విల్లువంచితిని. నాబాణమమోఘము. కావున దానిలో నీపాదములుగొట్టెదను.ఏమి సెలవు ?

పర—అలౌకికశౌర్యసముద్రా ! రామభద్రా !

శా. దేవా ! నీవు మహానుభావుఁడవు నా తేజంబుసాంతంబుగాఁ
బ్రావీణ్యంబున లాగికొంటివి జగద్భద్రాను సంధాయకా !
నీవేసర్వనియంతవాధ్యుఁడవు నా నేరంబుమన్నింపుమీ !
లావానంతయులేదు పాదములనే లాకొట్టరక్షింపుమా !

తపోమహిమచే నేను సంపాదించిన యాలోకములఁగొట్టుము.

రా—(బాణమునువిడిచి) ఇదినఱకు మీరార్జించిన పుణ్యకర్మముల వలనిఫలమీబాణముతో నశించినది.

ప—(ఆత్రముతో) దానినష్టమేమున్నది ? తిరిగి నేను మహేంద్రాద్రికిఁబోయి తపమొనర్చెదను. వసిష్ఠమహర్షీ ! నమస్కారము సెలవుతీసికొందును. (నమస్కరించును)

వ—(తిరిగినమస్కరించి) నమస్కారము—మంచిది వెళ్లిరండు.

ప—దశరథా ! సెలవు

ద—చిత్తము.

ప—(రామునికిఁబ్రదక్షిణమొనర్చి) రామా ! రామభద్రా ! రాజీవ లోచనా ! దయయుంచుము. సెలవుతీసికొందును. లక్ష్మణా ! పోయివచ్చెదను.

రా—చిత్తము.

(పరశురాముఁడు నిష్క్రమించును.)

ద—(రామునిఁగౌఁగిలించుకొని) నాయనా ! నాయనా ! అదృష్టవంతులము. మహాపద్రవముదాటినది. లక్ష్మణా! భరత, శత్రుఘ్నులను స్త్రీజనముతో నిటకుఁదీసికొని రమ్ము. వేగ నయోధ్యకుఁ బోవుదము.

వ—వారు తిరుగనిటకేటికి ? మనమేవారిని గలిసికొనిపోదము.

ద—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు.)

## 2. రంగము. అయోధ్య—రాజవీధి.

(జాంఘికుఁడు డప్పువాయించుచు బ్రవేశించును.)

జాం—డం, డం, డం. ఇదిగో యావమ్మందియినండి, సక్కగా ఆలకించండి, బాగాగెయించండి. డం, డం, డం, ఇయ్యాలసంతము శేమండాగానిదసరదమారాజుగోరు కొమాళ్ళతో కోడళ్ళ

తో మశేంవన్నానున్ను పెళ్ళోరితో భేమ్మలతో ఆటగాంళ్ళ
తో పాటగాంళ్ళతో యింకా యింకా సుట్టాలతో పక్కాల
తో. మంధీమార్బలంతో తిరిగి మనపట్టానికి యేంచాత్తాడంట
డం.డం,డం, మీరంతాయిల్లూ వాకిల్లూతోటలూ, దో
నలూ, కోటలూ, పేటలూ యావదాత్తి చింగారించుకొని,
ఓయ్ కలకల్లాడుతా, నవ్వుతా, పేల్తావుండాల్చిందో హాయాయి.
డం,డం,డం, అట్టాగాని సుమంతర మంతిరి గారిఆగ్నెల
యిందోహోయి. డం,డం,డం,(చాటించినిష్క్రమించును)

3 రంగము:—అయోధ్య, ఆస్థానము

(దశరథుడు, సుమంతుడు. వసిష్ఠుడు. శ్రీరామలక్ష్మణ
భరతశత్రుఘ్నులు, మున్నగువారు పరివేశింతురు.)

ద-చం. గురువర! యింతకాలమున కున్మథునైరి దయార్ద్రదృష్టి శ్రీ
కరులఁగుమారులంగని సుఖంబుగఁబెంచితిఁ బెండ్లిచేసితిఁ
నరకభయంబు వాసితిని నందనులంజిక రాజ్యభారముఁ
స్థిరముగనిల్పిజ్ఞాననియుక్తిఁ హరిపాదము లాశ్రయించెదఁ.

వ—ఔను! నీకింకఁగావలసిన దేమున్నది?

తే. గీ. చచ్చునటకును సంసార చక్రమందె
భ్రమణమొనరించుచునుబరా త్పరుని పాద
పద్మములఁజెందలేని య భాగ్యులకు
తలఁప బహుజన్మమట్లు వ్యర్థమగుఁగాదె?

ఐనను మనస్సు నిలుకడలేనివాఁడే యాశ్రమంబున నున్నను, నేయే
జపతపవ్రతాది కర్మంబులాచరించినను, నెచ్చోటికేగినను వ్యర్థుఁడై
చెడును.

ద—స్వామీ! తమరు సెలవిచ్చినది వాస్తవము.

కం. తాపత్రియంబు వలదని
కాపురుషుఁడు మోక్షగామి కా నేరండా

తాపత్రియంబు వీడుట
కేపని యొనరింపవలయు నెఱుఁగ దెలుపవే!

వ—దశరథక్షితీశా! సంక్షేపముగాఁ జెప్పెదవినుము.

సీ! అఖిలప్రపంచంబు హరిమయంబే కాని
యితరంబుగాదని యెన్నవలయుఁ
గామాదిశత్రువ ర్గమును జ్ఞానాసిచే
నేమఱకుండ జయింపవలయు
నిచ్చవచ్చినరీతి నెచటికిఁ బోనీక
పటుతరేంద్రియములఁ బట్టవలయు
సప్తాంగయోగంబు లభ్యసించిమనంబు
నిశ్చలంబైయుండ నిలుపవలయు

తే. గీ. నన్నిఁటికిఁ గర్తయాతఁడే యనుచుద్వంద్వ
ములకు నెక్కంతయును మదిఁ గలఁగనీక
ప్రకృతి సంబంధమునుశాసి పరమభక్తిఁ
గొలువవలయుఁ ద్రిశుద్ధిగఁ గొలువవలయు.

ద—మహాత్మా! ఇప్పటినుండియే సర్వసంగములు వదలుకొనియెదను.

వ—మానవేశ్వరా! వేగిరపడనేల?

చం. సతిపయిఁ గోపమొంది తన జందెములన్వడిఁ ద్రెంచివైచినే
యతినపపాదపూజలకు నర్థములాగెడు వాఁడుమోక్షమే
గతిఁగను? రాజయోగమునఁ గార్యములన్నిటి ధర్మమార్గ సం
గతి నొనరించుచుండుదకుఁ గానఁగరాదొకో మోక్షమార్గముల్

కావున ధర్మమార్గరతుండవై సర్వకర్మంబులొనర్చుచు ఫలాపేక్షనొందక పరమేశ్వరార్పణముఁ జేయుచుఁ గుమ్మరపురువురీతి మనస్సు దేనియందు నంటనీయక మెలంగుము.

ద—చిత్తము.

వ—ఇంక నీయభీష్టమేమి ?

ద.—మీయనుగ్రహంబున నాకభీష్టమెద్దియును లేదు, ఐనను.

(భరతవాక్యము.)

తే. గీ. ధరణిసస్యాఢ్యయౌఁగాక । ధారుణీత
లేంద్రులు ప్రజాలిసౌఖ్యమే । యొసఁగుచుండ
ఖ్యాతివడుదురుగాక భూ । ప్రజలు ధర్మ
పథమునఁ బ్రబలుదురుకాక । భవ్యనిష్ఠ॥

వ—తథాస్తు! తథాస్తు! తథాస్తు!

(తెరపడును.)

మంగళము.

గద్యము. ఇది యిక్కుర్తి తిరుపతిరాయ విరచి
తోర్వీసుతోద్వాహంబునం బంచమాంకము,
సంపూర్ణము.
ఓమ్ తత్సత్.



# ఉర్వీసుతోద్వాహము.

అనుబంధము.

1 సుమంతుఁడు—(బేహాగ్ రాగము - ఆదితాళము)

ఓనృపతియాల కింపుమా !

సూనృతులు, యశస్కాములు, దురితదూరులైశ్వర్య యుతులు మనరాష్ట్రిపుఁ బ్రజ॥ లో॥

భూపాసీచేఁ శాలితమగునీ - భూమండలంబులోపలను- శ్రీపతిచింతన మతిథిపూజనముఁ - జేయని వారు వెదకినను లేరు॥ ఓనృపతి॥

కోపుఁడు, జడుఁడును, హింసాపరుఁడును, గుత్సితుఁడును మూఢుఁడాదిగాఁ బాపజనులుమందునకైనను మనపట్టణమునఁ గనఁబడరు సత్యమిది॥ ఓనృపతి.॥

2. విశ్వామిత్రుఁడు—(జంఝూటిరాగము - ఏకతాళము.)

కామిత మెఱిఁగింతువినుమురాజా !

రాజా ! త్విషాంపతి సమతేజా ! విభ్రాజా ! యవ్యాజమతితో వినుమీ - యాజకల్పభూజా ! ॥కామిత॥

తామసులగు దైత్యులుమా - సీమంబులఁ జెఱచుచుఁగడు బాములు వెట్టుచునుండిరి - పార్థివముఖ్యానిత్యము ॥కామిత॥

ఆయసురుల వధియింపఁగ - నీయాత్మజులఁ జ్యేష్ఠుఁడ జేయుండగు శ్రీరాముని - సాయంబుగఁ బంపుమయ్య ॥కా॥

3 (దశరథుఁడు) హిందూస్థానితోడిరాగము - రూపకతాళము

స్వామి ! ఇట్లుకోరభావ్యమా ? - ఓమునివర ! కరుణా

కర ! చిరశుభకర ! సుగుణభర ! ॥స్వామి॥

బాలుఁడై చూడఁగ నేడఁట - పదియైనను రాలేదే

ఆలంబున నేలాగున - దోలునసురుల వీలెఱింగి ॥స్వామి॥

కార్ముక మెటు తాల్పవలెనో - కలంబ మెటుతొడుగ వలెనో

మర్మమెటు హరింపవలెనో-మది నెఱుఁగని నా తనయుని ॥స్వామి॥

సన్నుతధీర విచారా ! శ్రీ- సంయమివంశశుభాకర !

మన్ననతో మమ్ముఁగాంచక - బన్నములను బెట్టఁగనిటు ॥స్వా॥

4. విశ్వామిత్రుఁడు—(కేదారగౌళరాగము - ఏకతాళము.)

ఎందులకిటు మందునివలెఁ - గుందెదీవు రాజా !

సందియంబు దీర్చెదవిను - సవితృసమ తేజా ! ॥ఎందు॥

రాముఁడెన్న నరుఁడా ? శ్రీ - రమామనోహరుఁడు సు

త్రామ వినుతయశుఁడు దేవ - సార్వభౌముఁడు ॥ఎందు॥

లలితుండగు లక్ష్మణుఁడా - లక్ష్మీశుని మృదుశయనము

తలఁప శంఖచక్రంబులె - యలభరతశత్రుఘ్నులు ॥ఎందు॥

అరయఁగ నీపట్టమహిషి - యదితినీవు కశ్యపుఁడవు

పరమగోప్య మిదియేరికి - నెఱుకసేయకుండుమయ్య ॥ఎందుల॥

5 లక్ష్మణుఁడు—(బేహాగ్ రాగము -రూపకతాళము.)

అగ్రజుండేటికా - యసురులఁదోల్ల

నిగ్రహించివత్తునొక్క - నిమిషములోన ॥అగ్ర॥

ఉగ్రుఁడునే నాలములో - నాగ్రహింప నతిభీతిని

వ్యగ్రుండై పాఱఁడెభూ - పాగ్రణియోధాగ్రేసర ॥అగ్ర॥

భండనమున రిపుమండలి - ఖండించెద మొండెంబులు

వండించెదఁ బ్రేతములకు - మెండుగభోజన మిడెదన ॥అ॥

కరవాలముఁగొని దైత్యుల - నరలేకయె తెగటార్చెద

సరిచేసెదఁ బగఁదీర్చెద - జనకా ! తమసెలవైన ॥అగ్ర॥

6. దశరథుఁడు—(హిందుస్థానితోడిరాగము - ఆదితాళము.)

తనయులార ! తపసివెంటఁ - జనుఁడుముదమునన్
జనుఁడు ముదమునన్ వేగ - గనుఁడు మరలినన్ ॥తన॥
మునియాఁతి శ్రీయస్కర - మని మనసులలర నెంచి
శుభభక్తినిఁగావించి - చనుదెండీ శ్రీపరింబుగఁ ॥దన॥
భయదారణ్యంబటుపై - భయదాకారులు దైత్యులు
జయమెటుకొని వత్తురొకడు - జాగ్రితగా మెలఁగవలయుఁ ॥ద॥

7 దశరథుఁడు—(కమాచిరాగము - రూపకతాళము.)

సచివరా! వినుమా! కాలమహిమ ॥సచి॥
ఎప్పటికేవిధి జరుగనున్నదో - యెవ్వఁడెఱుంగఁడు గానఁదాఁ
నప్పటికప్పుడె సంతసింపఁగా - నెప్పదేరికైన ॥సచి॥
ఇంతకుమునుమన - మెన్నివిధంబుల- సంతసింపుచుంటి
మొకో - ఇపు - డెంతలోననది తక్కియొంతదు - రంత
చింత నొందితిమో ॥సచి॥
కావున సుఖదుఃఖమ్ములు దలఁపఁగఁ - గలిమిలేములు
నుసరిగాఁ - గావడికుండలుగా నెంచినచోఁ - గర
ముముదము గలుగునుగా ॥సచి॥

8 (సంవాదము కౌసల్యాదశరథులు)

ముఖారిరాగము - ఆదితాళము.

కౌ—ఈమహిఁబ్రాణము - లెట్లుభరింతును ?
రామునిసుగుణల - లామునిఁబాసినే ॥నీ॥
ద—వనితా ! యేటికి - వందురమాటికి
ముని, తనయులకే - ముప్పునుగలుగనీఁడు ॥వని॥
కౌ—రాముఁడేడ - సం - గ్రామమేడనా
కామరూపులను - గెలఁచుటేడహా ! ॥ఈమ॥

ద—మునిసాహాయ్యం - బునమనతనయులు
దనుజులనెక్క — పె - ట్టునఁదునుమ రే ॥వని॥

9 కుసుమగంధి:—మోహనరాగము - ఏకతాళము.
తల్లీ ! దురపిల్లనీకుఁ - దగునమ్మా ! ఇట్లు
తల్లీ ! సుగుణకల్ప - వల్లీ ! నీసుతుఁడెల్లియే వచ్చునుగా ॥త॥
క్షత్రియుఁడై తా - జననము నొందిన
ధాత్రిలో పలను - శత్రులనడఁచుట
క్షత్రియధర్మముగా - ఆ - ఆ ॥తల్లీ॥
అన్నియు నెఱిగిన - యమ్మ వెనీవీ
తెన్నునవేడ్వఁ బ్ర - ధ్వీతలమున సంకఁ
దెలిసినవారెవరూ - ఊ ॥తల్లీ॥

10 వసిష్ఠుఁడు—(ఆరభిరాగము—ఆటతాళము.)
రామునిసుగుణాభిరాము - నేమని యెంచితివాక్కో
శ్రీమహావిష్ణువె యంచును జత్తమునఁ దెలియుమమ్మ॥రా॥
చెడుదైత్యులుకడుఖాముల - నిడుచుండఁగసురల
కెపుడుఁ - గడతేర్పఁగ దైత్యులనీ - కడుపునఁబొడ
మెనుగోడుకై రాముని॥రా॥
సర్వరక్షకునిఁగంటివి - సాధ్వీ ! యెంతటి సన్యావో
యుర్విని నీకుద్దిమైన - యుత్తమాంగనలు గలనా॥రా॥

11 లక్ష్మణుఁడు—(బ్యాండుస్వరము - ఆదితాళము.)
ఈవన మెంతో వింతనుగొల్పుచు - నెసఁగుచుండెఁ
గనుమన్నా ! కనుమన్నా ! రామన్నా ॥ఈవ॥
ఎల్లయెడలఁ గేసరజంబీరము - లింపుమీరుఘన
సారవారములుఁ - బల్లవించు సహకారములదిరా
యుల్లమలరఁ జేయుచున్న వెడనెడ ॥నీవ॥

పూచిన నిలుచుద్రుమంబులు విరివిగ - గాచినదంత
శంతంబులు - గర్గొనవాచస్పతికైననలవికాదీ - వన
వర్ణనంబుగడుదుర్ఘటంబు ॥ఈవన॥

12 విశ్వామిత్రుఁడు—(మోహనరాగము - ఏకతాళము.)
అల్లదిగో ! తాటకవడిఁ - దెళ్లి నేయుమా - రామ అ।
పల్లదములు గూయుచుగ - ర్వమునదుముకులాడు
చుఁ - బెల్లుకల్లుఁదాౖవిమొడ - లెల్లమఱచివచ్చుచున్న ॥ద॥
ముదితయగుచునెమో నీమదినిఁదలఁపనలవదీ - మదిరాక్షి
నిజంపిమాకు - ముదముఁగూర్చు - వదలఁబోకు ॥మ॥

13 తాటక—(బ్యాండుస్వరము - ఆదితాళము.)
ఈగొల్లఁడెవఁడో - ఈ - పిల్లలెవరో - ఈ - యల్లరియేమో
చూడఁజూడ - నుల్లసమాయెనుగా ॥ఈ॥
భూషణంబులు - మృదు - భాషణంబులు - కడుతోష
ణంబులు - కాషాయవల్కలములు - గట్టైనునో
క్కండు - భూషణంబులచేతఁ - బాలుపొందిరిద్దఱు ॥నీగొ॥
ఇంతయాకటిచేత - సంతపించెడునాకు -
సంతసమయ్యెనుగా ॥ఈగొల్ల॥

14 శ్రీరాముఁడు—(జంఝూటిరాగము - ఏకతాళము.)
సందియంబుదీర్పుమువరజా ! ము
న్ముందుగానెస్త్రీలఁజంప - డెందమాసహింపకుండె ॥సం॥
మూఁడునెలలు సాము నేర్చి - మూలనున్న ముసలిదాని
వాఁడిమిఁగిలిపొడుచురీతి - నేఁడుచూడనయ్యెనాకు ॥సం॥
తడవుసేయవలదటంచుఁ - దపసిపల్కుచున్నవాఁడు
కడురయమునవిచారించి - క్రిమమెట్టిదొతగఁ
బల్కుము ॥సండియంబు॥

15 సంవాదము:— (తాటకరాములు)

బ్యాంఢుస్వరము - ఆదితాళము.

తా—జాలమేలవడి రావదేలనినుఁ - గాలనడఁచెద - ఓరి ! ఓరీ !

రా—తూలకుమిటుసీ - గోలఁదీర్చుటకుఁ - గోలయిదేకను - మోసీ
ఓసీ

తా—క్షుదననుదహించు విళంబము - కూడదురారా ! ఓరీ ! ఓరీ !

రా—మదమడఁగింతును బదినిముసములేక - గదలకయుండుమ
ఓసీ ! ఓసీ !

తా—నామమడంచెద - నోరీ ! ఓరీ !

రా—వేమఱువాగకుమోసీ ! ఓసీ !

తా—చీ - చీ - తులువా !

రా—చా - చా - కులటా ?

16 సంవాదము:— (రామమారీచులు)

హిందూస్థానితోడిరాగము - ఏకతాళము

రా—కదనముననను నిలుమా ! పదరక
విదితంబుగనొనరింతు మద్బలము - కద

మా—నిలునిలుమోబాల ! నిన్నిటఁ
బులుసుకూరవండించిమెక్కెదను॥నిలు॥

రా—మాటలతోఁబోరాటమేలవాచాటా ! సూటిగనిలువుమురా !
తాటకగతినిను - గోటనుమీటెదఁ - గద

మా—ఆఁమదానిఁబొరిపుచ్చితివౌరా ! ఆహా ! యెంతటిబలశాలవి
రా ! చూడునేఁడును - మాడకవిడనిను ॥నిలు॥

17 సంవాదము:— (రామమారీచులు)

తోడిరాగము - ఏకతాళము.

రా—చీ ! చీ ! నీచా ! మారీచా ! నీ - పీచమడఁతుఁ - గాచుకొ

మ్మికర్ - సైచితి నెన్నియ వాచ్యములాడిన - సాగదింక నీద
ర్పమిటర్ ॥జీచీ॥

మా—బాలుఁడవని తామసించుకొలదినిఁ - బ్రోలుచుఁదూలుచు నుం
టివికర్ - జాలమేల కొమనుపురికి నతిథిగఁ - జలుపువాఁడ ని
లుమిటర్॥ బాలుఁడ॥

రా—నదరకురా !

మా—పదరకురా !

రా—మదమడఁతును లే తులువా !

మా—నాతోఁ - గదనము సేయంగలవా ?

రా—చాల్ చాల్

మా—బలే ! బలే

18 సంవాదము:— (రామసుబాహులు)

తోడిరాగము - ఏకతాళము.

రా—అసువులు దీసినను నూరుమందని - మసలితినింతకు - చీ - చీ

సు—ఉసూరుమందునో - యెయుసూరుమందువో - యూహించుకొను
ముచాచాటా !

రా—కసిమసంగినీ - పసఁదూలించెదఁగాచుకొమ్ము రాక్షసాధమా

సు—పసఁదూలింతువా - పసఁదూలింతునో - పలుపోకలుపోకురనీచా !

రా—ఇంతకూ్రిరమా ? ఇంతపాపమా?

సు—ఎంతన్యాయ్య - వంతుఁడవురవహ్వా!

రా—చీలుతురానినుఁ

సు—గూలుతురానిను

19 శ్రీరాముఁడు—(బేహాగ్ రాగము - ఏకతాళము.)

కోల, దెమ్మ్మే - కూలనేసెదర్ - ఈ - బాలిశునిఁ - గోల
బాలురనుచు - నాలముగతి - బాగుగ నెఱుఁగటంచును

దూలుచున్న వాఁడువీని - తున్లిడంతుఁదెస్లి నేసి ॥కోల॥
శూలికైన నెనుదీయని - శూరులనుచు నెఱుఁగడితఁడు
కాలముచేరువైయెనప్పు - డాలోచనకలుగకునికి ॥కోల॥

20 సంవాదము:— (రామసుబాహులు)

బేహాగ్ రాగము - ఆదితాళము.

రా—ఓరోరీ! యసురాధమ! యిటు - కాఱులు పేలకురా -
తఱచుగాఁ - గాఱులు పేలకురా
శూరుఁడనైనను బీరముఁజూపెదు - పాఱకనిలువుము
రా - వడివడిఁబాఱక నిలువుమురా ॥ఓరోరీ॥

సు—కూళానీకీ వేళాకోళము - లేలానిల్వుమిటర్ - బటుకడఁ
కర్ - ఏలానిలుమిటర్.
నైళమనీపాణిానిలమునకిదె - వ్యాళంబైయొప్పున్.
దుర్మతి - వాళంబైయొప్పున్ ॥కూళా॥

రా—తున్ింగింతునురా.
సు—ఒున్ింగింతునురా.
రా—తులువా.
సు—పలువా.
రా—పదరకు.
సు—పదరకు.

21 విశ్వామిత్రుడు—(జంఝూటిరాగము- ఆదితాళము.)
అపరాధినివని - కృపఁబూనకయూ - చపలాక్షికినొక
నెపమెంచెన్ - నెపమెంచెన్ - ఉపలంబగుమని - శపియిం
చెన్ - అటఁదపియించెన్ ॥అప॥
అంతటనాకాంతామణి కాంతుని - చెంతఁజేరి సంత
పింపఁగా(శ్రీ) - కాంతుఁడు రాముండై జననమొంది
చింతఁదీర్పునీ కనిచనెఁ దపమున ॥కప॥

22 గౌతముఁడు—(సురటరాగము- ఏకతాళము.)

రామ ! సుగుణధామా! శ్రీమహిత ! ముఖజిత
సోమ! శ్రీ-రామా! నిన్నెన్నశక్యమా! ॥రామ॥
కామినిశాపముబాపి - ఘనపరిభావమునుజూపి
ఈమహిసుశ్లోకుఁడవై - తోమహానీయా! తలఁపఁగ ॥రా॥
ఈశశరణుశరణు - అఘవి - నాశశరణుశరణు
క్లేశహరణ శరణుశరణుశ్రీ ॥రా॥
ధరణిభరమువాపి - కని - కరముమాపైఁజూపి
నిరతము ఋతమునుపీడకం- నెగడుమార్య! సు
గుణధుర్య! ॥రామ॥

23 జనకుఁడు—(భైరవిరాగము - రూపకతాళము!)

ఘన తేజులీ ధనుష్మంతులేరో
మునినాయకా! యెఱింగింపవే!
మనసిజసన్నిభులీ - తనుజులఁగని - యనిశముస
మ్మోదమునవరలు నెవఁడో ॥ఘన॥
చూడంజూడక - వేడుకయయ్యెక్
నేడువీరి వదనముల్.
ఈడునకిరువురు జోడుగ - నెంతోపోడిమిగానుం
డిరిగా ॥ఘన॥

24 విశ్వామిత్రుఁడు—(ఆనందభైరవిరాగము - ఏకతాళము.)

వినుమోభూపనా! ఈ
ఘనున ఋతకుంజరహర్యక్షులు - మునివంద్యులు
రామలక్ష్మణాఖ్యులు ॥విను॥
మనువంశ సంభవుండగు దశరథ - మహీపాలునకుఁబ్రియా
త్మజులుని - యనుపమానభీమకార్ముకంబిటఁ - గనం
గొనఁగ వచ్చిరినేఁడిట్టులు ॥విను॥

అతులితముగ మత్కృత క్రతురక్షణ - మాచరించియా
లోననిశాచర - ప్రతతిఁగూల్చి మార్గంబున గౌతమ
పత్నినిశాపవిముక్తను జేసిరి ॥విను॥

౨౫ జనకుఁడు—(హిందూస్థాని కాఫీరాగము - ఆదితాళము.)

అయ్యా! దశరథ! వినుమయ్యా! దశరథ! మీ
నెయ్యముమాకియ్యెడఁగూర్చె రాముఁ ॥నయ్యా॥
వెయ్యేటికినా సుకృతఫలంబిది
చయ్యనఁ జేయందలఁచితి సీతో
వియ్యంబును మీరామలక్ష్మణులు
న్యాయ్యవర్తనులు సుఖముగనున్నా ॥నయ్యా॥
తాటకా సుబాహులాదిగ దానవ
కోటిఁదునిమి మునిక్రతువుదీర్చి ఘో
రాటవిశిలగతినున్న గౌతమవ
ధూటిశాపమును మీటియనంతర ॥నయ్యా॥
జనవంద్యుఁడు మీతనయుఁడు కౌశిక
మునివెంటను జనుదెంచి మత్పురికి
ననుపమాన శివునిధనువుఁదునిమెను
గనుక నాదుబుద్ధి పూర్వకముగా ॥నయ్యా॥
మీతనయునికిట నాతనయనిచ్చి
చేతువివాహము ప్రీతికరంబుగ
వేతరలిరండు సకుటుంబ బంధు
హితసకల పరివారయత్నముగ ॥నయ్యా॥

౨౬ పరశురాముఁడు—(సురటరాగము -ఆదితాళము)

ఎవ్వఁడవోరోరి! కొవ్విననవానివలెఁ - జివ్వననరి
గెడుకూళ! యీలీల - దుస్సీల! - పల్కవదేగా? ప

లిచిన నిలునిలు ॥మెవ్వఁడ॥

బెంషవడినయా - ఖండపరశుకో

దండముఁదున్చితి నాకెదురెవరని

గండుమిగిలి యరుగుచుంటివా ? ఛీ

ఖండనంబు సల్పుమిపుడునాతో ॥నెవ్వఁడ॥

ఇయ్యవనింగల యిలాధిపతులను

ముయ్యేఁడుమాఱుల్ వధించేఁడాఁ

గయ్యంబున భార్గవరాముండన

న్యియడ వినలేదట రకూర ! ఛీ ॥యెవ్వఁడ॥

27 సంవాదము:— (పరశురామ శ్రీరాములు)

దర్బారురాగము - రూపకతాళము.

శ్రీ—వలదువలదు కలహముఁనా - పలుకులాదరింపు

మయ్య ! తెలియవటయ్యా ద్విజులకుఁ - గలనము

మేలగునటయ్యా ! ॥వలదు॥

ప—మేలునీదులెన్నగఁ నీ - కేలర పౌరుషహీనా !

ఆలమొనర్తువలేదా ? - యసుఁలుగోల్పోయెదవా ? ॥మే॥

శ్రీ—బాపఁడ నీవేమన్నను - గోపములేదయ్యనాకుఁ

బాపహితంబగునీపని - యేపగిదినోనర్తునయ్య ॥వల॥

ప—పౌరుషముండదు కదదు - ర్బలునకు ధాత్రినిజూ

డనా - పౌరుషహీనునికెటుకో - పముగలిగె

దురా ! మూఢ ! ॥మేలు॥

28 (శ్రీరాముఁడు పరశురాముఁడు సంవాదము.)

బ్యాండుస్వరము - అటతాళము.

శ్రీ—బాపఁడ ! న్యాయ్యమెజేంగినసీతో - వైరమ్ము - కదుపా

పమ్ము - విడుకోపమ్ము - తెమ్ముచాపమ్ము - చేతు

రూపమ్ము - విహూపమ్ము ॥బా॥

ప—ధనువిదెకొనుమా !
శ్రీ—కనలక తెమ్మా !
ప—కొనియెక్కి-డకుండినం మ్రింతుక
శ్రీ—అటులేమచ్చటులభుజా.
పటిమనుగనుమా - తటుకునం దెమ్మా.
తృటిలోపలనే - తున్ంటితముసేతుక ॥బాపండ॥

29 పరశురాముండు—(బేహాగ్ రాగము - ఏకతాళము.)
రామనీన్నమ - హామహుండవు
మహామహుండవు - మాధవుండవు ॥రా॥
కోరినీదరిం - జేరుహరికి
వేతేమైశ్వర్యములు - వేమేటికయ్యా ॥రా॥
కరుణాభరణ - దురితహరణ
ఉరగశయనన - న్నోమయ్యా ॥రా॥
సూనుతనా - నేరమెన్నక
కూరుండనక - భారమనక
కారుణ్యముతోం - గావుముదేవా ! ॥రా॥

30 మంగళహారతి—(బేహాగ్ రాగము- ఏకతాళము.)
మంగళంబు రామచంద్రా! మంగళముజయ
అంగజజనకా ! గరుడప - తంగమహా! సంగీత.
లోలా ! శృంగారవేషా ! శ్రితజనపోషా !
రంగన్మనీషా ! రంజితభాషా ॥మంగ॥
ధీరజనమందార ! పారా - వారసమగంభీరశూరా !
సారవిచారా ! జగదాధారా ! సుందరాకారా !
నిగమసంచారా ! ॥మంగ॥
కామితార్థవరద ! గిరిజ - కాంక్షితాభివంద్య
నామ ! శ్రీమద్గుణధామా ! శ్రీకరనిష్కామా !
నీమా ! యభిరామా ! నిస్తులోద్దామా ! ॥మంగ॥

# ఆంధ్రప్రబోధినీగ్రంథ నిలయము.

ఇందు మతసాంఘిక నైతిక సంబంధమైన నవలలు, నాటకములు, ప్రబంధములు మొదలగు భాషాభివృద్ధి కరములగు గ్రంథములు సంవత్సరమునకు నాలుగు వెలువడుచుండును. ప్రతిగ్రంథమును గ్లేజు కాగితముల పై మల్లెమొగ్గల వంటి యక్షరములతో జూచు వారికి మహానంద జనకముగనుండి చదువువారి కెంతయు నుత్సాహమును గలుగజేయు చుండును. సంవత్సరము మొత్తమున ప్రకటింపబడు గ్రంథములన్నియు నాలుగు రూపాయల వెలకు మించి యుండవు. గాన భాషాభిమానులెల్లరు చందాదారులై భాషాపోషకులుగ నుందురని నమ్ముచున్నాము.

ఎప్పటి కప్పుడు చదివి పారవేయు వార్తాపత్రికల వలెగాక శాశ్వతముగానుండు నీ గ్రంథముల పై ప్రకటనలు వేయించుకొను వారికి చాలా లాభకరము.

చందా నియమములను గురించి కాని ప్రకటనలను గురించి కాని దిగువ చిరునామాకు వ్రాసిన వెంటనే తెలుపబడును.

ఆంధ్రప్రబోధినీ గ్రంథనిలయము.

మండవల్లి,

లింగాలపోస్టు,

కృష్ణాజిల్లా.